# మధుమాసము

( కృష్ణ పక్షము — శుక్ల పక్షము )



రచయిత :

విద్వాన్ బీర్నీడి ప్రసన్న.

# పరిచయము.

కవి సమ్రాట్ :

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

వి జ య వా డ.

నా తండ్రి మోషే కవి. నే నొక గ్రంథము వ్రాసితిని. మీరు పీఠిక వ్రాసిపెట్టవలయును — నాకుఁ బ్రస్తుతము తీరికలేదు. రేపురావలసినది — మరల రేపువచ్చినాఁడు. అప్పుడును దీరికలేదు- పుస్తకము నాచేతికిచ్చిపోవలసినది. నేను నెమ్మదిగా జూతును- జాగ్రత్తగా పరిశీలించి వ్రాయింపవలయును. నేనొక వారములో వత్తును- సరే- నాల్గయిదుదినములు గడచినవి. తీరికగానున్న సమయములలోఁ గొంతచూచితిని. ఇంక నాద్యంతము చదువక తప్పినదికాదు. నా కాశ్చర్యము వేసినది. మఱునాఁడు శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు వచ్చిరి. ఆయనతో మఱి యిద్దఱు సాహిత్యపరులు వచ్చిరి. వారికి గొన్నిభాగములు వినిపించితిని. వా రాశ్చర్యపోయిరి. కవిపేరు చెప్పగా వారు పూర్వజన్మార్జితసుకృతమనిరి. సాయంకాలమున విజయవాడ కళాశాలలో నాంధ్రోపన్యాసకులైన శ్రీ చెఱుకుపల్లి జమదగ్నిశర్మగారువచ్చిరి. వారికి వినిపించితిని. ఆయన యిట్లనెను "ఇంతచక్కని తెలుఁగు రచన, ఇంతటి కూర్పు నేర్పు, ఈభావసంపద యాశ్చర్యముకలిగించుచున్న" వనిరి.

నే నెదో పనిమీఁదనుండి పీఠిక వ్రాయలేదు. వారమైనతరువాత నాయనవచ్చెను. నే నిట్లంటిని. "ఈకథ నీ స్వంతముకాదు. రవీంద్రనాథ ఠాగూరుది. ఆయన యిట్లనెను. "నేను ఠాగూరుగారి కథ చూడలేదు. ఈకథ నేనచ్చముగాఁ గల్పించితిని. ఇది నా జీవితచరిత్రలోనిభాగము" అప్పుడు జమదగ్నిశర్మగారక్కడనున్నారు. శర్మగారిట్లనిరి " శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు 'కథలు - గాథలు' నని వ్రాసిరి. అందులో నొకచిన్న

కథ యున్నది. అది ఠాగూరుది. ఒక భోగముపడుచు తన్ను వలచిన వాని ప్రేమ పరీక్షించుటకు వాని తల్లి గుండెను పెకలించి తెమ్మనును వాఁడు తెచ్చును. దారిలో నాగుండె పుత్త్రప్రేమ వెలార్చు వాక్యములను బల్కును. ఇంతియే యా కథ" నే నిట్లన్నాను "అయినచో నిందులోని ప్రధాన విషయము తల్లియొక్క ప్రేమ నాశనరహితమైనదన్న విషయమేకదా! ఠాగూరు కథలోని స్త్రీ వెలయాలు. ఈ కథలోని స్త్రీ కులస్త్రీ. నాయకుని పెండ్లియాడుటకు నుద్దేశించిన స్త్రీ. ఈమె తల్లి గుండెకాయను దీసికొనిరమ్మనలేదు- శిరస్సును కోసితీసికొని రమ్మనును. తల్లి తలను గోయవచ్చును దప్ప గుండెనుకోయుట యెట్లు? గుండె యనఁగా హృదయములోని ప్రేమ యని యర్థము. పైఁగా నీయన కావ్యములో నంతకంటె నధికమైన యర్థమున్నది. ఇచట నాయకుఁడాంధ్రయువకుఁడు. తల్లి యాంధ్రభాష. భార్య ఇంగ్లీషుభాష. ఈవ్యంగ్యము ఠాగూరు కథలో లేదుగదా!" అనఁగా నీకవి యిట్లనెను. "మీరు నమ్మఁడు, నమ్మకపొండు నే నా కథ చదువలేదు- నేను దీనిని నాజీవితములోని పరిస్థితుల ననుసంధించి నిర్మించుకొన్నాను" అనఁగా నేనంటిని "నిజమే! నే నాఠాగూరుకథ చదువలేదు. అందఱు నన్నియుఁ జదువుదురా? ఆ వ్యంగ్యము పెట్టికొని యాయన కథ నిర్మించెను- ఈ వ్యంగ్యము పెట్టికొని యీయన కథనిర్మించెను. అక్కడ గుండెమాటాడినది. ఇక్కడ తల మాటాడినది. భేదమీసుంతయైనను కథలోని పట్టు- చనిపోయిన తల్లియొక్క హృదయము తన్ను చంపినవాఁడు కుమారుఁడైనను వానియందలి ప్రేమను వదలికొనలేదు అన్న మహావిషయము. ఈవిషయముననుసరించి యాకథయే యీకథ యనిపించుచున్నది. అచట వెలయాలు. ఇచట కులస్త్రీ. ఈకథలోని ప్రధానార్థము మాతృభాష నాశనమగుచున్నదని దుఃఖము. మఱియు నీ కథలోని నాయిక భర్తయొక్క సాహసము పరీక్షింపవలయునన్న ప్రయత్నమే కాని సంపూర్ణముగా దుర్జనురాలు కాదు అతని నా దుష్టకార్యమునుండి మరలించుటకు బయ

లుదేజినది. దైవ మననుకూలమై ఝంఝు వీచినది. ఆమె పడిపోయి నది. ఎదో మృగమువచ్చి కొమ్ముతో నామె డొక్కలోఁ బొడిచినది. తల్లి తల తఱిగి తిరిగివచ్చి నాయకుఁ డీ ప్రియురాలినిజూచెను. ఆమె య తని యొడిలో మరణించెను. ఆమె యతని ప్రేమయొక్క పరీక్షార్థము వాని తల్లి తల తఱుగుమన్నది. నిజముగా నన్నట్లులేదు ఆమె కాయూ హ నిజముగానే యంకురించినట్లున్నది. చనిపోవునప్పుడు పరీక్షార్థము చేసితినన్నది.

ఈ కావ్యము రెండుభాగములు. మొదటిది కృష్ణపక్షము-రెండవది శుక్లపక్షము. తల్లిని జంపుమని యామె మొదటిభాగములో ననే యడిగినది. అతఁడామెను దిరస్కరించి వెడలిపోయినాఁడు. కొంత కాలమునకు మరల ప్రేమ యంకురింపఁగా నామెయొద్దకు వెడలి నాఁడు. ఆమె మరల నామాటలేయన్నది. పైఁగా పదునుగల కత్తితీసి యిచ్చినది. అతఁడు వెళ్ళిన తరువాత నతనిని వారింతునని యపుడు వెనుక వెళ్ళినది. ఈ పరిస్థితులనుబట్టిచూడగా నతనిని వారింపవలయు నన్న బుద్ధి యామెకు- నతఁడు నిష్క్రమించిన తరువాత నుదయించి యుండునని తోఁచుచున్నది. ఆమె కా దుర్భావము నిస్సంశయముగా గలిగినది. తరువాతఁ గొంచెము మార్చుకొన్నది. తరువాత మాఱినను మొదటి పాపపుటూహకు ఫలితము తప్పలేదు. అది యెంత పాపపు టూహ యనఁగా తరువాత వచ్చిన సదూహగూడ దాని పాపమును దొలఁగింపలేనంతటిది. ఈయన కథలో నీ విశేషార్థమున్నది. నాయ కుఁడు మాతృపద పరమభక్తిభరితుఁడు. తొలుతఁ బ్రియురాలిని నిరసిం చినాఁడు. తత్పూర్వము నీవేదియడిగిన నది యిత్తునన్నాఁడు. ఆమె యితని తల్లి తల నడిగినది. ఇప్పుడు కాదన్నాఁడు. కాని యతని మన సులో వాగ్దానభంగభీతి కలిగినది.

బలి, శిబి, కర్ణుఁడు మొదలైనవారి ప్రాణభయములేకుండఁజేసిన దానశీలము వానిసి ప్రేరేచెను. అతఁడు ప్రేమచేత కాక వాగ్దాన

భంగభీతిచేత ప్రవర్తించినట్లున్నది. కాని ప్రేమలేదా ? ఉన్నది అది ప్రేమయేనా ? కాదు కామము. అతని యౌవనము. శరత్కాలపు వెన్నెలలు విజృంభించినవి. దానికిఁ దట్టుకొనలేకపోయినాఁడు. మరల నామెయొద్దకు వెళ్ళినాఁడు. ఒకవంక శరజ్జ్యోత్స్న చేత నుద్దీపింపఁ జేయఁబడిన యతని యౌవనభావము, ఒకవంక వాగ్దానభంగభీరుత్వము ఈరీతిగా నతఁడు కామదాసుఁడు కాఁడు. సహజమైన కామమునకు విడుగరయులేము. నేటియాంధ్రుని లక్షణమంతయు నతనియందున్నది. మాతృభాష ప్రియమైనదే! ఇంగ్లీషుభాషమీఁదఁ దీపి యెక్కువ. ఆభాష దృష్ట్యా యీభాష మెడకాయ కోసినాఁడు కాని మాతృభాష వానినెం దుకు వదలిపెట్టును? భార్యయు, బిడ్డయు నాభాషయే మాట్లాడుదురు- బంధువులందరు నాభాషయే మాట్లాడుదురు- ఊరిలోనందఱు నాభాష యే మాట్లాడుదురు. ఈకథయందీమహార్థమంతయు స్ఫురించుచున్నది. అంతేకాదు- ఆ భార్యకును చివరకు వీఁడు వీని తల్లిని జంపునేమో యన్న భయము కలిగినది. మాతృభాషలు చచ్చిపోవునేమోయన్న భీతి యాంగ్లేయభాషావిశారదులకును జాలవఱకు నుండవచ్చును. ఉన్నట్లే యున్నది.

ఈ కావ్యమునందున్న మూఁడవ పాత్ర- తల్లి హర్షమాంబ- (హర్షమమ) ఆమె పేరే హర్షార్థకమైనది. ఎట్టిస్థితియందైనను కొడు కునుజూచి హర్షమునే పొందును. ఇది చమత్కారము. 'మా తెలుఁగు వాళ్ళు ఢిల్లీలో పెద్దపెద్దఉద్యోగాలలో తగినంతమంది ఉన్నారు. అని ఆంధ్రమాత సంతోషించుచున్నదని జనులనుచుండగా ననుకొనవచ్చును. ఆ పెద్దయుద్యోగులందఱు నింగ్లీషు చదువుటచేత పెద్దయుద్యోగులు. సం తోషించెడిది తెలుఁగుదేశము. కొడుకు తన్ను ఁజంపినవాఁడైనను సరే- వాఁడు బాగుగానుండుట తల్లియొక్క యభివాంఛ. ఈ కావ్యమునం దింకొక్క యర్థముకలదు. వాఁడు తల్లినిజంపిన తరువాత భార్యయు

మిగులదు. మాతృభాష చనిపోయినచో నాంగ్లేయభాష వీరి కక్కఱకు రాదు. ఇది సూక్ష్మ విచారణచేతగాని నిర్ణయింపఁబడెడి విషయము కాదు.

ఈ కావ్యము పేరు మధుమాసము. అందు కృష్ణపక్షము మొదటిది, శుక్లపక్షము రెండవది. మధుమాసమనఁగా చైత్రమాసము. తొలుత శుక్లపక్షమువచ్చును. తరువాత కృష్ణపక్షమువచ్చును. ఇచట మాసశబ్దము ఋతుపర్యాయముగాఁ దీసికొన్నచోఁ జైత్ర వైశాఖములు వసంతర్తువై చైత్రమాసాంత కృష్ణపక్షము, వైశాఖమాసాది శుక్లపక్షము కలిసిన నెల యగును. చైత్రముయొక్క శుక్లపక్షము హూణభాష మనదేశము నాక్రమింపని కాలము వైశాఖకృష్ణపక్షము మాతృభాషను మనము చంపివేసికొనిన తరువాత ననుభవించెడి దుష్కాలము .ఇది యీనడిమి కథ.

ఈ కథానాయకుని పేరు అలిబాబు. కథానాయిక పేరు సుమబాల. ఋతువు వసంతఋతువు. భోగకాలము. యౌవనకాలము. కన్నుమిన్ను కనబడునా ? ఎంతవఱకు ధనమును ప్రోగుచేయవలయుననియే ! మరందము నాస్వాదింపవలయుననియే ! అదృష్టిలోఁ దల్లినేల చంపడు ? మానవప్రకృతియు, నేటి మనపరిస్థితియు ఋతువులలోని వసంతర్తువుయొక్క భోగప్రధానలక్షణమును మూఁటిని గలిపి యీకవి యీకావ్యకథను నిర్మించినాఁడు. తల్లి గుండె మాటాడెనన్న విషయము మాతృప్రేమయొక్క యనవధికత్వమును నిరూపించుచు కథకుఁ బ్రాణమువలె నుండి యితఁడది యెఱుఁగకుండ వ్రాసినను జనులను నమ్మించుట సాధ్యముకాదు గనుక నిక్కడ ఠాగూరునుండి దీని నవలంబించెనని యొప్పికొన్నను ఠాగూరు కథ వట్టి బొమికఁ- ఇతని కథ వసామాంసాసృఙ్మజ్జాదిరమణీయమైన జీవకళిక.

ఇదియంతయు కథావిషయము. కథావిషయ మెప్పుడుత్పన్న మవునని(గా కవియొక్క రచనాశక్తియు, ప్రతిభయు, భాషాసామర్థ్యమును పండితుడైన భావుకు నావేశించి వానిచేత నాసాంతము చదివించినప్పుడు, వాని రచన మనలను చదివింపవలయును. వాని పద్య రచన, పదములకూర్పునందలి వాని నైపుణ్యము, భాషమీ(ద వానికి( గల యధికారము, దానిని వా(డు వాడుకొనునేర్పు, ఔచిత్యముయొక్క తీర్పు, వాని యలంకారగ్రథనవైఖరి, వాని లోకజ్ఞత్వము, సంప్రదాయ శుద్ధమైన వాని భావనామార్గము మొదలైనవి పండితుడైన సహృదయుని హృదయములోపలి సారస్వతమాధుర్యాస్వాదనశక్తిని మేల్కొల్పును. ఏ కవి యొక్క యిట్టిశక్తి సహృదయ హృదయములయందు నిద్రాణమైయున్న యీశక్తిని తో(క త్రొక్కినచో( బాము లేచినట్లు లేపునో వా(డు మహాకవి. వా(డు మహాకవి కానిచో వాని కథ వృథా. కథకు సంతోషించెడివారు సారస్వతభావుకులుకారు. ఏవో భావములను, ఏవో కథలను వానియందొక మెలిక యున్నచో, ఒక ముడి యున్నచో, ఒక పరమార్థమున్నచో నెక్కువమంది యానందింప(గలరు. వారు భావుకులుకారు. బుద్ధిమంతులు. వివేకులు. లోకమునందలి భావములలోని యుత్తమాధమత్వమును నుంత తెలిసికొన(గలవారు. భావుకు(డు వీరి కంటె భిన్ను(డు. వా(డగాధప్రకృతి. సూక్ష్మ సూక్ష్మాంశములయందలి నిశితత్వమును సమాలోచించుటచేత తద్రహస్యమంతయు ఛందోఽలంకార వ్యంగ్యరమణీయమైన పరిణత భాషాస్వరూపమున వికసించిన నందన పారిజాతముయొక్క సౌరభరహస్యము నెఱి(గినవా(డు. వా(డు భావుకు(డు. అట్టి రచన కవి చేయగలిగినచో వా(డు మహాకవి.

ఇత(డట్టి రచన చేయ(గలవా(డు- చేసినా(డు- రచనాదృష్ట్యా యిదియొక మహాకావ్యము- ఇత(డొక మహాకవి —

ఆంధ్రసారస్వతమున నొక కావ్యముయొక్క గొప్పతనము తొట్టతొలుత కవియొక్క పద్యరచనాశక్తిమీ(దనాధారపడియుండును పద్యము

రచించుట యందలి ప్రతిభ యనంత విధములుగా నుండును. ప్రసిద్ధులై సుప్రతిష్ఠితులైన పూర్వమహాకవుల కీర్తియంతయు ప్రధానముగా వారి పద్యరచనాశక్తులమీఁద నాధారపడియున్నది. ఎంతటి కల్పనాశక్తియున్నను, ఎన్నియెన్ని శిల్పములు చేయఁగలిగినను, పద్యరచనాశక్తియందు వాఁడు తక్కువవాఁడైనచో వాఁడు సుప్రతిష్ఠుఁడైన జాడలేదు. ఆ శిల్పాదులయందుఁ గొంచెపడినను పద్యరచనాశక్తియందు నధికసమర్థుఁడైనవాఁడు కాలమునకు నిలువద్రొక్కుకొనెను. మొదట నీ కవియొక్క పద్యరచనాశక్తి యెట్టిదని విచారించినచో- దానికొక స్థితి కలదు ఏ కవియొక్క సర్వపద్యములు నొకదానితో నొకటి తులతూగవు. కథా కథనసమయమునఁ బద్యములు విశ్లథబంధములగును. వర్ణనాసందర్భమున వాని యుత్తమమైన పద్యరచనాశక్తి గోచరించును. కథాకథనమార్గమున వాని యితరశక్తులు గోచరించును. ఆ యితరశక్తులను జొనిపి వర్ణనాసందర్భమునఁ దాను వెలయించఁగల పద్యరచనలోని బిగువులేనితనమును సుకవి సంబాళించికొనును ఆ శక్తి లోకమునందలి నుడికారమును సంగ్రహించుట, వాక్చాతుర్యమును వెలయించుట, యలంకారములను సమయోచితముగాఁ బొదుగుట, నడుమనడుమ గడుసు పలుకుబడులను జొనుపుట మొదలైన లక్షణములు కలిగి యుండును.

ఇతని కావ్యము మధుమాస వర్ణనముతో నారంభించును. మొదటి పదునేనుపద్యములు మధుమాస వర్ణనము. రెండవభాగము శరత్కాలపువెన్నెలల వర్ణనముతో నారంభించును. అవియు నొక పందొమ్మిది పద్యములు. మఱియు రెండవభాగములో నాయకుఁడు వాగ్దానభంగభీతిచేతఁ బూర్వదాతలను బ్రశంసించును. అచట నొక పది పద్యములు కలవు. ఈ నలువది పద్యములును మఱియు నందందుఁగల వర్ణనాప్రాధాన్యముగల మఱొక పది పద్యములును గలిపి యితని పద్యరచనాశక్తికి మచ్చుముక్కలై యున్నవి. అతిశయమైన యితని యే పద్య

రచనాశక్తి యీ పద్యములందు నిండియున్నదో యా శక్తి తదితర పద్యములయందు నంశతః అభివ్యాప్తమైయున్నది. ఇతని పద్యరచనాశక్తికిఁ బ్రధానము లీ పైన చెప్పిన యేఁబది పద్యములు. తెలుఁగులో మహాకవుల కావ్యములన్నియు నించుమించుగా నిట్టివే!

ఈ పద్యరచనయొక్క లక్షణమెట్టిది? దానియందింతటి యుత్తమత్వ మెట్లు సిద్ధించినది? పద్యమనఁగా గణ యతి ప్రాసలచేత నిబద్ధమయిన యొక ఛందఃఖండము. అది సామాన్యముగా నొక భావమును జెప్పును. ఆ భావములోఁ గొన్ని వాక్యములుండవచ్చును. లేదా యంతయు నొక వాక్యమే కావచ్చును. వాక్యమునందుఁ గొన్ని శబ్దములుండును. శబ్దములందక్షరములుండును. అక్షరములు అచ్చులయు, హల్లులయు కూడిక. శబ్దములు నింతియే- వాక్యములు నింతియే. కాని శబ్దములను గవి నిర్మింపలేదు. కవి వాక్యములను నిర్మించును. ఈ యచ్చులయు, హల్లులయు కూడికగల యక్షరముల కూడికయైన శబ్దములు వేనికవి యొక విలక్షణమైన శక్తిగలిగి యుండును. అవి యుచ్చరితములై యొక సవ్వడిని పుట్టించును ఏ శబ్దమునందును శ్రవణ కటుత్వముండదు. కొన్నింటియందున్నట్లు కన్పించినను వానియందొక విలక్షణమైన శబ్దశక్తియుండును. ఒక కవి తా నొకవాక్యమును నిర్మించినపుడు, పద్యమును వ్రాసినపుడు వాఁడు వాడుకొనెడి శబ్దములగుంపులో సావర్ణ్యత్వలక్షణముగల బహుశబ్దములను సమీకరించుట ప్రధానాంశము. ఇట్లు మహాకవుల సర్వపద్యరచనయు నీ సావర్ణ్యత్వశక్తిచేత నొకప్పుడు ధారాశుద్ధియై, యొకప్పుడు భిన్నగుణద్యోతకత్వమై యా గుణ ముచ్ఛ్రితిని బ్రాపించినపుడు వానిమార్గము ప్రత్యేకమన్నట్లు, వాని పద్యరచన కొక ప్రత్యేకస్థితియున్నట్లు లోకము తలంచును. వానికి భాషయందు స్థానములభించును. సూక్ష్మముగాఁజూచినచో నిది మానసైకవేద్యమైన విషయము. వివరించి యెంత చెప్పినను నంకెకురానిది. సామెతయున్నదె! 'యింటివెనుక నింగువచెట్టు–ఎంతకోసినను గుప్పెడు కా'దని.

తొట్టతొలుత సుకవి రచనయందు నీ యక్షరసన్నివేశ చారుత్వముండ వలయును. రెండు నొకటియేమో యనిపింపవచ్చును. కాని రెండవది పద్యపుఁగూర్పులో సడలింపలేకుండ నేదిచేయునో యది. ఈ గ్రథనశక్తి పద్యముయొక్క భిన్నదేశములయందు నిండియున్నచో వాని పద్యము నిండుగానుండును. ఈ గ్రథనశక్తి వాని జీవలక్షణమున కనుకూలమైన సావర్ణ్యత్వముచేత నిండియున్న బహుశబ్దముల సమాహారజన్యవిలక్షణ గుణము ననుసంధించియేయుండును. లోకమునందు వేలకొలఁది జను లున్నారు. అందఱును క్రియావంతులే ఒకొక్కని క్రియాశక్తికి వ్యక్తి త్వమును, ప్రత్యేకతయు నుండును. కొందఱిశక్తి యల్పముగానుండును. కాని వానికి వ్యక్తిత్వముండును. కొందఱధికశక్తిమంతులు, వ్యక్తిత్వ రహితులు. అట్లే కవుల వాగ్వైఖరియందును— ఈ కవి రచనయందు వ్యక్తిత్వమున్నది. ఒక విలక్షణత్వమున్నది. తత్కారణములను పదిం టిని మనము తేవచ్చును. ఆ పది కారణములును విడివిడిగా సమృద్ధిగా కనిపించుచోట్లు వంద యుండవచ్చును. అవి యన్నియును గలిసిన యొక వైలక్షణ్యము వీని రచనయందు వ్యక్తిత్వస్థాపనచేయుచున్నది. ఆ కారణములలో నేదియేది యెన్నెన్నిపాళ్ళుగా కలిసి యీ వైలక్షణ్య మును సంపాదించెనో చెప్పుట యరిది.

ఇతఁడధిక సమాసరచనము పొంతకుఁబోఁడు. ఒకటిరెండుచోట్ల నట్టివి తోఁచినచో దాని విచారణలేదు. ప్రధానముగా శబ్దములను విడి విడిగానే తీసికొనును. కాని కూర్పుచేత, చెప్పిన వాక్యపద్ధతిచేత, తెచ్చిన మాటలయొక్క పొదుగుటచేత పద్యము ధగద్ధగాయమానముగా నుండును.

ఇండన్నన్ సరె యిత్తు పొమ్మనిన పోదే? పట్టిపల్లార్చు బ్ర
హ్మాండంబా? యొక చిన్నిపిట్టయది తా నన్నంత నెగ్గించుకోఁ
గండల్ కండలు కోసియిచ్చి పరువున్ గాపాడుకొన్నాఁడు ధీ
రుండై యా శిబివల్లభుం డతని తీరుల్ జాతి కాదర్శముల్.

ఈపద్యమున్నది- ఒక యాచకుఁడున్నాఁడు- సరే యిత్తునుపో యన్నచో సరిపోదా ? అదియేమి బ్రహ్మాండమా ? అది చిన్న పిట్ట- అన్నంతయు నెగ్గించుకొనుటకు కండకండలు కోసియీవలసివచ్చును పరువు కాపాడుకొన్నాఁడు- ధీరుడై యాశిబి కాపాడుకొన్నాఁడు. మాట లన్నియు మనము నిచ్చలును వినెడివే- కాని యీమాటలు పద్యమును నిండియున్నవి. ఎడములేదు. ఇత్తుపొమ్మనినపోదే ? బ్రహ్మాండఁబా ? ఒక చిన్నపిట్టయది నెగ్గించుకో పరువున్ గాపాడుకొన్నాఁడు- ఈమాట లన్నియు లోకమునందలివై శిబి కథకు దోహదమునుగలిగించుచున్నవి. చిన్నిపిట్టయది యన్నంతవఱకు విషయము సామాన్యమువలెఁగనిపించి యన్నంతనెగ్గించుకోఁ గండల్ కండలుకోసి యనుటచేత నా సామాన్య విషయ మసామాన్య విషయమైనదన్న భావమును గలిగించి పరువుఁ గాపాడుకొన్నాఁడనుటలో నొక దుష్కరకృత్యమును నెరవేర్చెననియు, ధీరుండై యనుటచేత నాకృత్యముయొక్క దుస్సాధతను జెప్పుటయైనది. ఇది యొక విచిత్రమైన రచన- మాటలవలెఁ గనిపించును. ఆ మాటల లోని, యక్షరములలోని సావర్ణ్యముచేత నొక సౌకుమార్యగుణము సిద్ధించును. పైన చెప్పెడి తీఱుచేత వ్యంగ్యము సమృద్ధిగా పండును. ఇది యంతయుఁగలిసి పద్యము. ఇదియిట్లుండఁగా నొక్కొక్క గడుసు శబ్దము మఱియు నధికచమత్కారమును బ్రవేశపెట్టును.

ఒడ్డాణిల్లు సముద్రసప్తకముతో నొప్పారు బంగారపుం
గడ్డన్ జోగికిఁ ద్యాగమిచ్చె నదియేగాకమ్ముడై పోయి రాల్
బిడ్డల్ తాఁ దుది బానిసీఁడయినఁ బాలిఁచెన్ హరిశ్చంద్ర రా
జుడ్డీనాశయుఁడై నిజోక్తి సురవంద్యుల్ గారె యేతాదృశుల్.

ఒడ్డాణిల్లు - ఒడ్డాణముగా నగుచున్న యని యర్థము. దీనిని నామధాతువుగా స్వీకరింపవలయును. వసుంధర సాగరమేఖల. ఆ భావ మును చెప్పుటకు నితఁ డొడ్డాణిల్లు అన్న శబ్దమును బ్రయోగించెను.

ఇది శబ్దరత్నాకరములో లేని శబ్దము. ఈ శబ్దము నిట్లు ప్రయోగించుట సాగరంమేఖలార్థము నొయ్యారముగా సమకూర్పబడుటచేత నొక యౌచిత్యమును సంపాదించికొన్నది. కవియొక్క ప్రతిభ యనఁగా నిట్టిది.

ఇట్లే యితని వర్ణనాపద్యములన్నియుఁదేసి యితని రచనలోని వైలక్షణ్యమును జూపించినచో గ్రంథము పెరిగిపోవును. ఒకసామాన్య భావమును పూర్వులుచెప్పినదానినే విలక్షణముగాఁ జెప్పుటచేతఁగూడ నొక్కొకపుడు కవియొక్క యధికశక్తి భాసించును.

పరమపదమ్ముకోసము ప్రపంచము రోసి యెడారిదారులం
బెరిగిన యోగు లీ చిలిపి వెన్నెలలో మదనజ్వరమ్ము ము
మ్మరమయి గింగరాల్ దిరిగి మౌనముగా దిగజారి రింక నె
వ్వరు తలక్రిందుగారు ? రసవన్మధుమాసముసేయు మాయలన్.

చిలిపి వెన్నెల – గింగరాల్ తిరుగుట – ఈ రెండుశబ్దములును సర్వత్ర పరిచితమైన యీ పద్యగతభావమునందు నొక నూత్నత్వమును సంధానపఱచును. ఈ కవియొక్క సర్వరచనయందు వాని భావముల కన్నింటికి వెనుకనున్న యతని సుకుమారశైలి ప్రకాశింపఁజేయుచుండును. ఆ శైలీసౌకుమార్యము సర్వరచనయం దనుస్యూతముగా వచ్చును. ఇతఁడు చెప్పు సర్వభావములకు నది పరిపోషణ కలిగించుచుండును. ఒక పట్టువస్త్రమున్నది- దానికొక మెత్తని తళతళకలదు. ఆ తళతళ యాబట్టనేయుట కుపయోగింపఁబడిన దారములన్నింటియందును, ఆ దారముల ప్రత్యణుదేశమునందును గలదు. ఒక సుకవియొక్క కావ్యమునందలి సర్వరచనయందు నతని శైలిగా మనస్సునాకర్షించు నొక మాధుర్యమో, సౌకుమార్యమో మొదలైన గుణములుగా నీ తళతళయుండును. చిక్కని పద్యరచన పుంజ మెక్కవపెట్టి నేసినగుడ్డను వలె భాసింపఁజేయును. దానికి మన్నికయుండును శవములమీఁదఁ గప్పెడి గుడ్డలకు మన్నిక యెందులకు ?

ఇంత చిక్కని కంటిచూపు సహించి మెప్పుదలతెచ్చెడి మెత్తని తళుకు కలిగిన యుత్తమజాతి పీతాంబరముమీఁద జరీపూలు కుట్టినట్లు కవియొక్క యలంకారములు, వ్యంగ్యములు భాసించుచుండును.

ఇది యితని కవితాస్వరూపము. ఈకవితయందు సౌకుమార్యముకలదు. ఊహాశాలిత్వము కలదు. క్రొత్త యుపమానముల జతగూర్చు ప్రతిభకలదు. తెలుఁగు నుడికారముల పొసగింపుకలదు. అర్థాంతరన్యాసములను జతకూర్చి పద్యమునకు మేలిమితెచ్చు చాకచక్యము కలదు. సంప్రదాయశుద్ధికలదు. గడుసు కల్పనలుకలవు. అన్నింటికి నుదాహరణములు చూపింపవచ్చును. ఈ చిన్ని కావ్యము పైనిచెప్పిన గుణములు మఱియున్నియుఁ గలిపి వ్రాయఁబడిన రమణీయమైన రచన. ఈగుణములలో నొకొక్కఁడు పెరచోట్ల నింతకంటె నధికముగా నుండవచ్చును. అన్నియు సమపాళములోఁగూడి యొక విలక్షణమైన రచనసాగుట యితనిలోఁబండినట్లు మఱి యెచ్చటను పండలేదని చెప్పవచ్చును. ఇవియన్నియు నంత సమపాళముగా కుదిరినవి. ఇతని రచనాసౌకుమార్యమువంటి సౌకుమార్యముకల కవులు నేఁడు లేరనియే యనవలయును. ఒక రిద్దఱున్నా రేమో ! అందులో నొకఁడు చనిపోయెను. అతనియందు తక్కిన యితనిగుణములు లేవు. ఇతని కొన్నిమాటలు నిత్య నూతనములుగానున్నవి. ఆంధ్రభాషాసరస్వతికి నలంకారములుగా నున్నవి.

ప్రకృతి శృంగార విభ్రమారంభములకు
నొక యిరుకులేదు మధుర మధూదయమున-

ఈ యిరుకు శబ్ద మిచ్చట నిట్లువాడుట తెలుఁగు బాసలోని పలుబడి సొగసుతెలిసినవాఁడే చేయవలయును.

.... .... మనయాంధ్రుల చేతివాసి యా
చాలునఁబుట్టి నేఁడు దిగజాఱవుగా నగమీతగాఁడవై.

ఈ నగ మీతగాఁడవై యనుట యచ్ఛమైన తెలుఁగువాఁడనవలయును.

అయెనుబోయె నాటి ప్రణయమ్మిఁక పుడంకెకురాదు శూన్యమై
పోయిన మబ్బులో మెఱుపు పుట్టునె? ....

పోయిన మబ్బులో మెఱుపు పుట్టునె యనుట నాచన సోమన్న వంటి వాఁడనవలయును—

మన చాకిరికత్తెలు పై నదృష్టముల్

ఇట్లు చేసినచో నదృష్టములు మనకు సేవకురాండ్రగుదురని యర్థము. ఉక్తి వైచిత్ర్యమట్లుండగా చాకిరికత్తెలన్న తెలుఁగు శబ్దము వాడుట స్వచ్ఛమైన యాంధ్రత్వము.

ఇట్లీతని భాషాపాటవము, తెలుఁగుమాటల సంతరింపు, ప్రతిభా ద్యోతకములైన శబ్దముల సమకూర్పు వ్రాసినచో నెంతయైన యగును.

ఇతఁడు నన్ను తన కావ్యమంత పీఠిక వ్రాసిపెట్టవలయునని యడిగెను. నిజానికిది యితని కావ్యమంత పీఠిక. అతఁడు పరిమాణ దృష్ట్యా చెప్పినచో రెండింతలు వ్రాయవచ్చును. కాని పీఠిక యింతే యుండవలయును.

ఇతఁడు పరమ గ్రాంథికవాది. నేటి భావకవులన్నచో నితనికి నిరాదరణ. సంప్రదాయశుద్ధమైన ఛందోమార్గమన్నచో మిక్కిలి యభిమానము. నేటి సామాన్యోక్తిలోఁ జెప్పినచో రూపాయికి పదునాఱణాల యాంధ్రుఁడు.

ఇతఁడింత కవి యయ్యెననఁగా నీ సంస్కార మితనిలో మొదలు పెట్టలేదు— ఇతని తండ్రియైన మోషేకవి రచన చూచినగాని యితని బండారము బయటపడదు— ఆ తండ్రి యంతకవి. వీరు ముగ్గు రన్న దమ్ములు. మువ్వురును కవులు.

'కవిత పుట్టిల్లు వెన్నెలకంటియిల్లు' అని పూర్వ మొక కవి

యాడిన బీరము వీరికిని గలదు. ఈయన యింటిపేరు బీరనీడువారు వారి యింటిపేరులోనే బీరము కలదు. ఇతఁడు భారతీయుఁడు- హరి జనుఁడు. క్రైస్తవుఁడు. భారతీయమైన క్రైస్తవమత మెట్లుండవలెనో వీని కావ్యమునుబట్టి తెలిసికొనవలయును.

ఇతఁడు నాతో 'కవిత్వము మేమేవ్రాయవలయును- మరెవ్వరు వ్రాయఁగలరు!' అన్నాఁడు. మే మనఁగా - నొకటి హరిజనులు. దానికి మించి వారి తండ్రికొడుకులనియర్థము. ఇతని కవిత్వము చదివి నప్పుడు నా కామాట నిజమే యనిపించినది

ఇతఁడు మహాకవి యనుట నిస్సందేహము. మహాకవి కుండ వలసిన లక్షణములన్నియు నీ కావ్యమునందు కనిపించుచున్నవి. మహాకవి బిరుదము పెట్టికొనుచున్న నేటి పలుమంది కవులలో నిన్ని లక్షణములు లేవనియే చెప్పవలయును. కనకాభిషేక మితనికిఁ జేయ వలయును. ఏనుఁగుమీఁద నితని నెక్కింపవలయును కాని యితని కులమున కా సామర్థ్యములేదు. పరుల నాశ్రయించి బ్రదుకవలసిన కులమైనది. కర్మ యనఁగా నిది. ఒక సంస్కారముచేత నింత కవి యైనాఁడు. ఇంకొక సంస్కారముచేత నా కులమందు పుట్టినాఁడు. అందుచేత ధనవంతుఁడు కాలేదు. ఆకులము ధనవంతమైనది కాదు. కులాభిమానపు వెఱ్ఱులు విజృంభించిన కులముకాదు. మఱియు నింత కవి యైనాఁడన్నచో నింతటి కవి యని యెక్కువమంది తెలిసికొను టకు వీలైన కవితామార్గమునందు లేదితని కవిత్వము. ఇది బాసలోని నిగ్గులతోఁగూడిన వెలయింపులుగల రచన— ఇది తెలిసికొనుట కొద్ది మందియందే జరుగును. ఇతఁడొక మహాకావ్యమును వ్రాయుగాక !!

(Sd.) విశ్వనాథ సత్యనారాయణ,

విజయవాడ — 30-5-64

# కావ్యోదయము.



మాది విద్వత్కవికుటుంబము. లోకోపకారకములయ్యు-శ్రీకోపకారకములైన యుపాధ్యాయత్వములు మా స్వత్వములు. మా నివాసములు గ్రామీణములు. "రైలెన్నఁ డెక్కమింతకు- పోలేదా నరసరాయపురిదాటి" అన్న యుదాత్తులు మా సోదరులు. మా యిలు వేల్పు విద్యాదేవి- ఐననేమి? ఆ దేవేరి మంజీరమంజుల ఝుళంఝుళ ధ్వనులు లేమిపడఁతి యనుపగజ్జెల గయాళి సవ్వడులలో నడఁగిపోయినవి. మా తండ్రి మహోన్నత బ్రాహ్మణాకాశమునుండి తీవ్రకృషితో గానసాహితీ గంగమ్మను భయంకర నిమ్నాస్పృశ్యతావనికిఁ దెచ్చిన మధుర కవితా భగీరథుఁడు—

ఆయన హరిజనాంధ్రలోకమున కాదికవి నన్నయ్య. దుగ్ధములాని స్తనములు గ్రుద్దు కృతఘ్ను లొకరిద్దఱు దక్క "మా యీకళకు దోహదము బీర్నీడి మోషేకవిగారి చేతిచలువయే" యని తెలుఁగుగడ్డ నలుదిక్కుల నాయన యశస్సుఁ జెప్పుకొను గాయకులు, కవులు, కథకులు నేఁడు పెక్కురున్నారు. పోనుపోను కాలసైరంధ్రి వీరికే కంఠమునదికి యేవేషమువేయునో యనూహ్యము.

మా తండ్రి పుత్రవాత్సల్యజలధి. పితృభక్తివిషయమున నేను నసామాన్యుఁడనే! అయిననేమి? కాలప్రభావమున నే నసిన నాయనకు సరిపడలేదు. నన్నొకయింటివానిఁగాఁజేసి వేఱువెట్టినాఁడు. నే నాసమీప గ్రామమునఁజేరి జీవనము సాగించుకొనుచున్నాఁడను. నే నిల్లువీడిన కొన్నాళ్ళకు మా యమ్మ జబ్బునఁబడి మంచముపట్టినది, మా యయ్య నాకు కబురుపెట్టలేదు. నే నాగడపత్రొక్కలేదు. పట్టుదలలో మావి

రెండును గట్టితలలే. ఎందునఁగాకున్ననందునమాత్రము నేను తండ్రిని మించిన తనయుఁడనే. ఆయూరి పెద్దముత్తైదువలు కొందరు జాలిపడి, నాకడకువచ్చి మా యమ్మ మరణావస్థఁగూర్చి వాపోయిరి.

అమ్మకై నా కా యింటికిఁ బోక తప్పినదిగాదు. పోయినాను. నేనుపోయిన తత్క్షణమే యాయన మొగము దప్పుకొన్నాఁడు. మాయమ్మ దుస్థితికి గుండెలు బాదుకొనుచు బస్తీకిఁజేర్చి, పేర్వడ్డ వైద్యులచేత మందులిప్పించుచు, సాయశక్తుల పోరాడినాను. కల సర్వస్వము ధార వోసినాను. తల్లి దక్కలేదు. 'మీరింకొక్క నెల ముందుగావచ్చియున్న రుగ్మత ముదురకుండెడిది- మీతల్లి దక్కెడి' దని వెజ్జు లోదార్పులు పలికినారు. ఒక నెల ముందుగా నే నట్లెందుకు చేయకుంటినాయని మఱింత క్రుంగిపోయితిని. అందుకు నాతల్లిని నేనే చంపుకొన్నట్లైనది. దుర్భరభీకరదుఃఖధ్వాంతము గాఢముగా నన్నలముకొన్నది. వెక్కివెక్కి యేడ్చియేడ్చి నా యోడ్చిన కన్నీరే మున్నీరైనది. ఆ మున్నీరే పరిణామశీల కాలపరిణాహమున కరుడుగట్టుకపోయి విషాద కావ్యమైనది- అదే యీ మధుమాసము—

ఇది కబ్బముగా తీరి, యింటఁబడియుంటఁబట్టి యిప్పటికి తొమ్మిదేండ్లు. దీనికన్న నేడాదిముందుపుట్టిన 'పృథ్వీరాజప్రబంధము' చిమ్మటకొట్టుకులఁదప్పుకొని, పెట్టెనుండి వెలువడి. వెలుఁగుమొగముఁ జూచు భాగ్యమునకు నోచుకొనకపోయెనే- దీనికెట్లు సాధ్యము ?

తీయములు జాతీయములునైన నుడికారములకు, ధ్వని చమత్కారములకుఁ దావలమైన మా తండ్రిగారి "శ్రీకృష్ణరాయచరిత" ప్రబంధ మిరువదేండ్ల యీడుదాని గతియేమిటి ? ఇట్లే యెన్నియెన్ని కావ్యరాజములు తెరమఱుఁగుననే యుండిపోవుచున్నవో! ధీవరగ్రామణు

లుపేక్షాభావమున నుద్ధరింపమి నచ్ఛస్వచ్ఛములైన జాతిరత్నములు సముద్రగర్భమున నట్టుపడియుండ-పైపైమెఱుఁగుల కృత్రిమరత్నములు లోకము నాకర్షించి శిరోధార్యములగుచున్నవి ! విడ్డూరమేమి ?

రసబంధురములైన శ్రవ్య ప్రబంధములకు మురిసి, కవుల సమ్మానించు రాజన్యుల స్వర్ణయుగము స్తమించినది. ఇది ప్రజాప్రభుత్వ యుగము. దృశ్యకావ్యములకు పలుకుబడి హెచ్చినదని భ్రమసి, పృథ్వీరాజ రచనానంతరము "మేలుకొలుపు- ప్రొద్దుపొడుపు- హనుమత్ప్రభావ" మను నాటకములు వ్రాసితిని.

ఐనను ప్రయోజనముశూన్యమై, యవియుఁ బేటికాంతర్గతములైనవి. ఎప్పుడోయొకప్పు డచ్చటచట నులివెచ్చ తేనీటి యిచ్చగాంధ్ర వేడుకో లున పెండ్లింట్ల కక్షతలుగా, నధికారుల బదిలీల రాకలకు సన్మాన నీరాజనములుగా గాక, కలముఁబట్టి సత్కవితలు లిఖించు నవకాశము నుత్సాహము నీనాఁటి కవి కెక్కడిది? అంతంతకైత లా శ్రీనాథ పెద్ద నాదు లూరకే వ్రాసినారా? కవిత్వపు విలువలెఱిఁగిన రసజ్ఞశేఖరు లున్నారు గావుననే అలనాటికవి—

నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడె మాత్మకింపయిన భోజన మూయెలమంచ మొప్పఁద
ప్పరయు రసజ్ఞు లూహఁ దెలియంగల పాఠకలేఖకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే !

అని సాహంకారముగాఁ బ్రవర్తించి, సారస్వతాలంకారములు సంత రించి, మాట నిలువఁబెట్టుకొనఁగా—

ఏడుపుగొండిపిల్లలు నదేపనిగాఁ జెవినిల్లుగట్టి పో
రాడు గయాళిగంప ప్రియురా లెటుఁజాలనికూడు కప్రపుట
వీడెముమాట కేమి ? యిది నేఁటి పరిస్థితి యేమి వ్రాయ నా

బూడిద—— అని యావేదనాభారమున నేటి కవి వాపోవవలసివచ్చినది.

లంకణరోగికి వాముధారకముగా– 1961 ఏప్రిలులో నా పంపుకొన్న చైత్రలక్ష్మిని దయతో ప్రభుత్వమువారు వారి "ఆంధ్ర ప్రదేశ్ మాసపత్రిక"లోఁ బ్రకటించి ముప్పదిరూపాయీల పసదనము నొసఁగినారు. ఆ చైత్రలక్ష్మిలోని నాకవితాపరిశ్రమను గుర్తించియేమో! ఆయేటి నవంబరు నెలలో గుంటూరాంధ్రక్రైస్తవ కళాశాలామతల్లికి నూఱవయేటి పుట్టుకరోజు వేడుకలు జోరుగా జరుపఁగోరి ఆమహోత్సవ కార్యకలాపములలో నాంధ్రసాహితీశాఖగా నచ్చటి యాంధ్రాధ్యాపకులు అమరభాషామృతపర్జన్యులు శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు, కరుణశ్రీ సార్థకనామధేయ శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు, భువన విజయ మేర్పఱచి, సాహితీలోక సుప్రసిద్ధులు బ్రహ్మశ్రీ పల్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, శ్రీ వావిలాల సోమయాజులు, స్ఫూర్తిశ్రీ ప్రభృతులకిచ్చు అలసాని, తెనాలి, పింగళాది కవిదిగ్గజముల పాత్రలతోఁబాటు నాకును ధూర్జటికవిపాత్రనిచ్చి యానాఁటి కృష్ణదేవరాయ మహానంద సదస్సులోఁ బాల్గొన్నంత యుత్సాహ మొదవించినారు. అరసూఱాఱులిచ్చి కాశ్మీరు శాలువ బహూకరించినారు. వారి యౌదార్యదోహదమున నిరంతర నిరాశానిబిడనిశీథనిమగ్నమైన నా కవనశ్రమకు ప్రమోదప్రబోధవిద్యుల్లత యొక్క త్రుటి మెఱసిపోయినట్లైనది. నాబ్రతుకున కదియే ప్రప్రథమ ప్రమదమాధురీశుభోదయము.

1940 సంllన నా యుపాధ్యాయశిక్షణదశలో ఒంగోలు గవర్నమెంటు ట్రైనింగుస్కూల్ వార్షికోత్సవ సందర్భమున శ్రీ భారతుల

మార్కండేయశర్మగారి పరీక్షాధికారిత్వమున నిర్వహింపఁబడిన కవిత్వపు పోటీలలో విజయవంతమైన నా యాశుధారా కవిత్వముఁ (సీతాకళ్యాణ ఘట్టము) బురస్కరించుకొని. ప్రధానోపాధ్యాయులు శ్రీ ఏ. వి. సుబ్బారావు ఎం. ఏ. ఆనర్సు గారు, నాటి సభాధ్యక్షులు కోర్టుమునసబ్ గారి షేక్ హేండ్‌తో తిక్కన భారతములను నాకుఁ బ్రథమ పారితోషికముగా నిప్పించిరి.

1943 సం॥న చిలకలూరిపేట మహోన్నతపాఠశాలా పూర్వ విద్యార్థిసంఘమువారు శ్రీ ధూళిపాళ సుబ్రహ్మణ్యశాస్త్రి. శ్రీ జాస్తి వేంకటనరసయ్య, శ్రీ బృందావనము రంగాచార్యులు శ్రీ షేక్ దావూదు కవి ప్రభృతులతో భువనవిజయ మేర్పరచి, నాకు ధూర్జటికవిఖ్యాతి నిచ్చి సన్మానించిరి. ఇవే నా యాబాల్య కవితా కృషి కందివచ్చిన సంబరములును! సన్మాన సంభారములును!

ఈనాఁడు సాహిత్యజగత్తున వింతవింత పరిణామములెన్నియో పొడసూపుచున్నవి ఇవి యన్నియు సారస్వతమునకు శుభము నాపాదించునవియని చెప్ప వలనుపడదు. ఛందస్సు సర్పపరిష్వంగదారుణ మని, వ్యాకృతి భాషాశృంఖలయని తలంచి యభినవ్యులు వచన పద్యములు వ్రాయుచున్నారు.

ఇది తుఫానువలెఁ జెలరేగి చప్పున నడఁగిపోవు నుద్యమము. నా కా గాలిసోకలేదు. మంచిత్రోవలుపాడుబెట్టి, పెడదారులఁబడిపోవుట యెట్లు వాంఛనీయము? బహువిధ నియమములఁబెరిగి మెఱుఁగు దేఱిన కవితావధూటి నీతినియమములులేని స్వైరిణివంటిదికాదుగదా! నాది పసుపుకాటుక, నల్లని జంపుసిగ కమ్మలు ముక్కెర నానుపట్టెడ గాజుపూసలు కడియా లందెలుఁగలిగి చక్కని కట్టుబొట్టులతో నుండెడి

తెలుఁగుఁ బడుచుఁగయిత! ఈ మధుమాసము- నాయనుభవావేశములఁ బెనవైచికొని యావిర్భవించిన శృంగార కరుణాత్మక కావ్యము.

ఇందు మాతృవధ మున్నది ఇది విపరీతముఁగా నున్నదని కొందఱు విమర్శకులనిరి. ఈవిషయమున నాకును నమస్సొప్పకున్నది. ఎచ్చట నేకావ్యములోను దల్లినిజంపిన కొడుకులేడు. ఒక్క పరశురాముఁడుమాత్రము మాతృవధ మొనరించినాఁడు. అరాముఁడు కామధేనువింటనున్న తబిసిబిడ్డఁడు. తన తండ్రి తపఃప్రభావమునఁ దన తల్లి తనకు దక్కునను నమ్మకమున్నవాఁడు. అందుకే తన తల్లిని వధించినాఁడు. ఇచ్చట తల్లి బ్రతుకుట కట్టి మహిమలే లేవు. ఏదేనియుక్తిచే గారడీచేసి బ్రతికించిన కథకు జీవమేయుండదు కృత్రిమమగును.

ప్రియురాలి సరసఁ దల్లి చేదయ్యెనన్న లోకోక్తికి హత్యాసన్నివేశము ప్రాణమువోసినట్లైనది. ప్రియావ్యామోహముననో, స్వార్థపరతాప్రేరణాధిక్యముననో నాయీకథానాయకునివలె మాతృమారణకారణులైన కొందఱువ్యక్తులు, కొన్ని వాస్తవికసంఘటనలు నాదృక్పథమునఁ దిరుగ, నేనిట్టి కల్పన మొనర్చితిని ఒకానొక కావ్యపీఠికలోఁ "గొన్నిరచనలయందు- వాని పేరు పోకడలే వేత్తై కావ్యప్రయోజన మేయడుగు పొరలయందో యడఁగి, చమత్కారప్రధానముగాఁ బైరంగులు తీర్చుచుండును. నేఁటి వింతలు వేడుకలలో నిదియొక వింత" యని శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు పేర్కొన్న విషయము జ్ఞప్తివచ్చి, నేను పొరబడుచున్నానేమోయని కావ్యాంశములనెల్లఁ బరిశీలించి చూచుకొంటిని. మధుమాసము లేకున్న మాతృవధ లేదు. అవధ లేకున్న కథయే లేదు. కొందఱు విమర్శకులున్నారు- వారుడుకునీళ్ళతోఁ గొంపలు గాల్పఁజూచు వ్యర్థప్రయత్నులు. అట్టివారీ కబ్బమునకే కాదు- ఎట్టి మహాకావ్యమునకైనను జెడుగుఁ దొడుగుటయందు సిద్ధహస్తులు.

మఱొక విశేషము- (పేజీ 55 లో) కొడుకా! భద్రమురా! అను నిట్టి మూఁడు పద్యములపై " చచ్చినతల్లి మాటాడునా? అదీ పట్టె శిరస్సుతో- తన్నుఁ జంపిన కొడుకుతో? నిదియంత యుచితము గాలేదు. దానికి శరీరశాస్త్రమొప్పుకో"దని యొకరిద్దఱు విమర్శించినారు. వారికి నాహృదయమును, కావ్యములోని తల్లి మాటాడిన విధానమును బోధపడలేదు. దాని నర్థముచేసికొనుటకుఁ గావ్యదృష్టితోఁబాటాత్మదృష్టియుఁ గావలయును.

స్వచ్ఛమైన పుత్రప్రేమగలవారు చచ్చియుఁ జావక ఆత్మాకారమునఁ దమబిడ్డలఁ జుట్టుకొని వారి కాపదలు వచ్చుతఱిఁ గాపాడ నల్లల్లాడుచుందురు. ఆ విషయము నా కనుభవమున నంతుబట్టినదే— (4-వ పేజీలో) " అది మాతండ్రి " అని కృతిసమర్పణ ప్రస్తావమున వ్రాసితిని. ఈసందర్భమున నాయనుభవ మొకదాని నిట నుట్టంకించుట యప్రస్తుతము గాదనుకొందును. అది మాయింటివారందఱకుఁ దేటతెల్లమే! కుటుంబభారమున నందఱ మొకచోటనుండ వలనుపడక యుద్యోగనిమిత్తము నేను నాల్గయిదేండ్లనుండి యింటికి, నిల్లాలికి నెడమై దూరముగా వేఱొకయూర నుండవలసివచ్చినది. సెలవులలో, శన్యాది వారములలోమాత్ర మింటికిఁ బోవుచుందును. ఒకనాటిరేయి నిద్దురలో స్వప్నమున నా మాతృశ్రీ యథాస్వరూపమునఁ గన్పించి- యింటికిఁ బొమ్మని యాదేశించినట్లు నాయాత్మ వ్యాకులపడినది. త్రుళ్ళిపడిలేచి- యారాత్రికారాత్రియే బయలుదేరి యుదయము తొమ్మిది గంటల కిల్లుజేరితిని. ఇంట మా చిన్నవాఁడేండ్లసంధివచ్చి క్రిందుమీఁదగుచుండగా— మావారూరొకెత్తుకువచ్చునట్లాలుగోలుగా నేడువసాగిరి. వారు నన్నుఁజూచి యచ్చెరువున నేడ్పుమాని- నీ కీవిషయ మెవరు చెప్పిరి? ఎట్లు రాఁగలిగితి వని యడిగిరి. నేనును- నాకిది యెవరు చెప్పిరి? ఎట్లు రాఁగలిగితి నని నాలోనేను ప్రశ్నించుకొని యాశ్చర్య

పడుచుం బ్రత్యుత్తరముం జెప్పకయే పిల్లవానివిషయముం జూచుకొంటిని. ఈ విషయ మనుభవశాలులకే విదితము. ఇచ్చట శారీరకశాస్త్ర ప్రసక్తిలేదు.

నే నించుమించుగా 1927 సం॥ నుండి నెలనెల నాంధ్రసార స్వతసర్వస్వమనఁదగిన "భారతీ పత్రికను" బఠించుచునేయున్నాను. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారి దేశోద్ధారక బిరుద మద్దానివలననే సార్థకము. ఆ మహనీయుని సదమల యశోమూర్తి కా భారతి యక్షర వజ్రనీరాజనము. తెలుఁగువానికి సాహితీకామధేనువు. నేఁ డొకరిద్దఱకు కొమ్ములువచ్చి మెలితిరుగుట కా పత్రికామతల్లి కృపాప్రకటనప్రభావమే ప్రధానహేతువు. ఆ యమ్మ పేరు నాజిమ్మకు బలుకమ్మన. ఆ యమ్మ నాపాలిటి ప్రత్యక్షబ్రహ్మభాంతి. దేశమునఁ బేరెన్నికగన్న నేఁటి పండితులు, కవులు, పండితకవులు, విమర్శనకళానిధులు నా కాపత్రికామూలముననే లెస్సగాఁ బరిచితులు.

నా యీ మధుమాస కావ్యమున కొక కవిపండిత విమర్శనాత్మక పీఠిక కావలయును. దానఁగాని యజ్ఞాతములైన నా కవిత్వపు నిగ్గు నీటులు సహోదరాంధ్రులు, సాహితీలోకసహచరులు గుర్తింపరు. అప్పుడుగాని న న్నావరించుకొనియున్న నిరాశాభావమేఘములు నిర్ధూతములుగావు— అని యూహించి, అయుత్సాహమునఁ బులకితహృదయుఁడనైతిని.

సమకాలికస్పర్ధలు, స్వార్థపరత్వములు నతిశయించిన యీదినాల నన్నాదరించి. నాతలంపు ఫలింపజేయు విశాలహృదయులెవ్వరు? అన్న ప్రశ్న నా యాశయమును మునువెనుకలకూపినది. ఆ ప్రశ్నకు "మేము మే"మంచు నాస్మృతిపీథులలో శ్రీశ్రీశ్రీ దివాకర్ల, రాయప్రోలు, దీపాల,

పింగళి, వేలూరువారు మృదుల దరహాసమున దర్శనమిచ్చిరి. నమస్క రించుచు, మీరా? మీరా? యంచు వెలికిఁజూచితిని. వారి చిరునామాలు తెలియకపోయినవి. వారు పునీతమొనర్చుచున్న భూములకు పోయిరా నసాధ్య మనిపించినది. నిరుత్సాహమందితిని. ఆ నా నిరుత్సాహము పటాపంచలగునట్లు 'కవి సమ్రాట్టు' పటపట నుక్కుఁగంబమును భేదించుకొనివచ్చు నరసింహస్వామ్యాకృతిని నా మనఃపథమున నిండుకొని యట్టహాసమున హుంకరింపసాగెను.

సాహంకారచారువైన యయ్యాకృతికిఁ బ్రహ్లాదమానమానసుఁడనై విస్తుపోవుచుంటిని. నా యమాయికతకుఁ గిలకిల నవ్వుకొనుచు నా బహుకాల పరిత భారతి ప్రత్యక్షించినది. తికమకలుపడెడు నన్నామె యాప్యాయముగాఁ బ్రబోధించి, దుర్ధీమదాశయఖండనోదగ్రములైన యా నిశితకరాగ్రములఁజూచి భీతిఁగొంటివా? ఎంతటి ధీరోదాత్తుఁడవోయి! చూడు మా భయంకరసుందరాకృతి హుంకృతులే పగఱకు పరంధామము! ఆశ్రితులకు చిదానందము!. ఆ లీలనే యా యయ్యకాగ్రహానుగ్రహము లత్యధికములను ప్రతీతి. దుష్కృతికి సుకృతికి విచిత్రముగా నొకే సద్గతిఁ బ్రసాదించుట కా యయ్య పుణ్యప్రయాగ!– ఎవరమ్మా! అయయ్య?– ఉగ్రనరసింహస్వామి– ఆ స్వామి నాకేటికి?– నీ పీఠికకు– నాపీఠిక కాయనయెందులకు?– కావ్యౌచిత్యముల నావిష్కరించుటకు– నరసింహస్వామియా? పీఠికకా?– అవునయ్యా! ఔను! నరసింహస్వామి యన నాయనయేనయ్యా అయనయే! గద్య పద్య సువిమర్శనసాహితిలో త్రిగ్గన్నున్నాయన! అయనే వాఙ్మయాపరపరమశివుఁడు. విశ్వనాథస్వామి. సంస్కృతాంధ్రాంగ్ల త్రిభాషాత్రిశూలమున్నాయన. – ఏమిటమ్మా నీ యఱవసంస్కృతము? ఎక్కడ విశ్వనాథస్వామి? ఎక్కడ నరసింహస్వామి? ఏమి టీ ప్రాక్పశ్చిమాశల సంబంధానుబంధము తల్లీ!. – సాహిత్యసంబంధానుబంధమోయి! – అదెట్లు?–

అయ్యయో! యీవఱకు మీ కృతులకే నిష్ఠదరిద్రత పట్టినదనుకొంటిని; ఇప్పుడు నీ మతికిఁగూడ పట్టినట్లున్నదే? విశ్వనాథుఁడే నరసింహుఁడు! నరసింహుఁడే విశ్వనాథుఁడు! దైవాంశమున నీ యిరువురు నొక్కరే! నీ కియ్యెడ సంశయమున్న భారతక్షేత్రమునఁ జెఱకుపంట పండించిన తిక్కయజ్వ నడుగుము. విశ్వనాథుఁడే నరసింహుఁ డెట్లో యట్లే నరసింహుఁడు నారాయణుఁడు. శైవ వైష్ణవము లొక్కటై రూపుఁ గొన్నట్లు స్వచ్ఛ బ్రాహ్మణ్యమున విశ్వనాథుఁడే సత్యముగా నారాయణుఁడై, ప్రౌఢసాహితీవైదగ్ధ్యమున విశ్వనాథ సత్యనారాయణ యైనాఁడు. జగత్ప్రసిద్ధి నిపుడాయన "విశ్వనాథ"యగుట నీ కవగతమేగదా? అవతారదశకమున నరసింహుని ప్రభావమెట్టిదో సాహిత్యమున విశ్వనాథ ప్రతిభ యట్టిది. ఇంకనైనను దెలిసినదా నరసింహ విశ్వనాథుల వివరణము? ఇప్పటికైనను దెలిసినదా నీ పీఠిక కాయన యెందులకో? శుభము! పోయిరమ్మనుచు నప్రయత్న నిమీలిత విశాలనయన శోభితాతి సుందరశీర్షమున, మృదులారుణ పాణిపల్లవముల నద్దుకొనసాగినది.

ఆ భారతి యమోఘామృత వచోఽనుజ్ఞలకు నా హృదయమున నద్భుతానందములొదవి. సమ్మతినెఱిఁగించుకో "నమ్మా!" యనునంతలో నా యవివేక ప్రశ్నములకు నదుత్తరమీయ నా నలువరాణి తల యెంత వేఁగెనో! మనస్సెంతవీఁగెనో! వికీర్ణనీలవిలోల కోమల కబరీభర, దీర్ఘనిశ్వాసకంపితారుణాధరి యామె యదృశ్యయైనది.

నాయూహ లిట్లుండ- 1963 డిసెంబరున నరసరావుపేట వాస్తవ్యులు. సుప్రసిద్ధ జాతీయవాదులు శ్రీ కపలవాయి కాశీరామారావుగారి యింటి పరిణయమహోత్సవములసందర్భమున శ్రీ పి. వి. రమణారెడ్డిగారి యాధ్వర్యమున నిర్వహింపఁబడిన సదస్సునఁ బెక్కురు కవి పండితులతోఁబాటు నేనుఁ బాల్గొంటిని. అనాఁడు ముక్తకంఠమున

నాయొనర్చిన కవితాగానమునకు ముగ్ధులైనపెద్దలు పదుగురిలో శ్రీ మద్దులపల్లి సత్యనారాయణగారు ముఖ్యులు. వారు సభానంతరము నన్నుఁ జేరఁబిల్చుకొని నీ కృతులేవేనియున్నఁ జూపుమనిరి. ముద్రణమునకు సిద్ధముగానుంచుకొన్న నా మధుమాసమును ప్రతిపద్యము విమర్శన దృష్టితోఁజూచి యిండని యిచ్చితిని. కళాశాలోద్యోగమున వారికి గ్రుక్కతిరుగదు. వా రా కావ్యమునకు విపుల పీఠిక వ్రాయఁబూని, కార్యాంతరవ్యగ్రత నది సాగక "నీ కావ్యము వర్ధమానసాహిత్యమున కపూర్వాలంకారమనుచు, నిట్టిదానికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారే పీఠిక వ్రాయవలయును. వారు వ్రాసిననే యీ కావ్యమునకు వాసి. ఆయన యిం దప్రతిరథప్రతిభాశాలి. తెలుఁగుబాస కాయన బేసికంటివేల్పు"నుచు నాయూహలకుఁ బ్రోద్బలమొసంగిరి. శ్రీ మద్దులపల్లివారికి నాయెడ నెంత యభిమానమో ! ఎంత ప్రేముడియో ! మఱి నా కవిత్వాభ్యుదయమునెడ నెంతటి గాఢవిశ్వాసమో ! కృతిసమర్పణలోని చివరిపద్యము చివరి " నినుజేరెనె? నేనునువత్తు రేపొ! మాపొ ! వరహాలతల్లి ! యగుఁబో! మనకయ్యెడనైన సద్గతుల్" అన్న పంక్తులు మార్చునంతవఱ కొప్పుకొనలేదు. నేను వారి యుద్దేశమును గ్రహించి, వారి సాహిత్యసౌమనస్యములకు మనస్సునఁగరఁగి, వెంటనే " నినుఁ జేరెనె ? కూర్మి మఱొక్కమాఱు మీరేవిధినేనిఁ దల్లి ! జనియింపఁగ రండు తెలుంగుగడ్డకున్ !" అని మార్చినాను. వారు దానికి మఱింత సంతోషించి శుభంభూయాత్ ! శ్రీ విశ్వనాథవారు తప్పక పీఠిక వ్రాసి యిచ్చెదరు. పోయిరమ్మన్నారు. నా యంతరంగభారతి పలికినట్లే వీరును బలికిరి. పండితవాక్కు రిత్తవోదు ! శ్రమము వట్టిపోదు !

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు నాయభిలషించినట్లే కావ్యమంత పరిచయము వ్రాసియిచ్చినారు. ఈ విషయముగా వారికడకు రెండుమాఱులు పోయిరావలసివచ్చినది వారు మఱే యితరములగు

తొందఱపనులలోనున్నారో యేమో ! చెప్పసగడువున కియ్యలేకపోయి నారు. ఈ సందర్భముగా నాతిరుగుటకు ఖర్చు లెంతైనవో ప్రభుత్వ మువారు తమ యుద్యోగికిచ్చు 'బేటా'కు నాలుగంతలుగా నిచ్చినారు. నాగ్రంథము సాంగోపాంగముగాఁ బ్రతి పద్యమును విమర్శనదృష్టితోఁ జదివినారు. సంతోషించినారు. బహుగాసంతోషించినారు. సుప్రసిద్ధాంధ్రాధ్యాపకులగు వారి మిత్రుల వారి శిష్యకోటి హృదయములఁ బ్రతిఫలించి, ప్రతిధ్వనించునంతగా సంతోషించినారు. వ్రాసిన పరిచయమును వినిపించి, విలువగల ఖద్దరుశాలువ, జరీయుంచు దోవతులు పుచ్చుకొమ్మని యిచ్చినారు.

చిరకాలమునుండి నాయొనర్చిన భాషాసేవకుఁ బ్రతిఫలమునఁ దగినట్లు వ్రాసియిచ్చిన పరిచయమునకు నాచిత్తము పండిపోయినది. వారి యాదరణమునఁ దండ్రి తరమునుండి యాకొన్న నాకడుపు నిండిపోయినది. నాఁడు వారు వ్రాసిన పరిచయము నా హస్తములఁ బెట్టుచుండగా నుప్పొంగివచ్చు నిరంతరానందాశ్రువులతో- కవితావేశమున —

" మిమ్ముంగాంచిన మీయశస్సువినినన్ మీ నాతలీక్షించినన్
జిమ్ముల్ వాఱుచు నూతనాంధ్ర కవితా చిత్తానురాగ ప్రహ
ర్షమ్ముల్ మ్రోతలువెట్టు నాహృదయ మార్యా! యివ్వి యేపూర్వజ
న్మమ్ముల్ కూర్చిన చంద్రచంద్రికల సంబంధానుబంధమ్ములో !"

" రా ! రావయ్య ! కవీశ్వరా ! యనుటకున్ రారాజు లీరోజునన్
తే రాయక్షరలక్షలేమిటికి ? కాణీలిచ్చునే ? లుబ్ధతన్
పూరాపడ్డ కుబేరలోక మిఁక మాబోంట్లన్ బరాయించు వా
రేరీ ? కవ్యధిరాజ ! త్వాదృశులు సాహిత్యప్రియుల్ దక్కినన్!"

" ఒక చేమోడ్పునకే దయంబరగి నన్నోదార్చు మీకూర్మి యు
న్కికి నాచిత్తముపండె, నాకడుపునిండెన్ గృష్ణరాయండె యం
ఘ్రికి తోడానిడి భద్రదంతిపయి నూరేగించినట్లయ్యె వా
రక వర్ధిల్లుఁడు! విశ్వనాథకులచంద్రా! ....

సత్యనారాయణా! యని పూరింపఁబోయి- యాసంబుద్ధికి బుద్ధిగుదరక స్వామి! సత్యప్రభూ! అని పూరణచేయఁజూచి- యదియు నచ్చక, చివరకు సాంద్రకీర్తిప్రభా! అని పూరించినాను.

నా పడెడి తికమకలకు మందస్మితమొనర్చుచు, పొమ్మిరమ్మని చేయెత్తి దీవించినారు. మనోవాక్క్రియలు నొక్కటైన శ్రీ విశ్వనాథవారి దేశహితైక దీక్షాసల్లక్షణము సహృదయ హృదయంగమము. వారి యపరిమితౌదార్యమునకు, నసమభాషా సేవకు, నద్భుత కవితాభిమానమునకు నే నాజన్మాంతర కృతజ్ఞుఁడను. వారికి నా నిత్య సత్య కవితా పూజా సుమాంజలులు!

" తెలుఁగు జీవియొకటి సిలుగులుఁపడుచున్నఁ
బొగిలిపోవు! గుండె పగిలిపోవు! "

అని యిట్టి వచఃప్రాగల్భ్యమున విషగర్భమధురిమల గుప్పుచు, కలికుఁగసాయితనము లోదాచుకొని, బౌద్ధపరమార్థగీతికలఁ బాడుకొనుచు; విన్నన్న చెప్పినదే వేదమనినమ్మి సన్మానోత్సవముల నందించు తెలుఁగుల సంపదాసవములఁ దెగత్రావి కైపెక్కి, కళయన్న మాదే! కళాకారుల మన్న మేమే! యన్న గర్వమున విఱ్ఱవీఁగు నొంటికంటి కళాకారులు గాంధీమహాత్ము నాఱని వేడినిట్టూర్పు సెగలకు నవనీత మృదులహృదయములుకరఁగి, హరిజనలోకహితమాచరించు, యథార్థ కళాప్రపూర్ణులఁ

జూచి, సిగ్గున నిప్పటికైన నాత్మాకృతులు మార్చుకొని, గొంతులు సవరించుకొన్న దేశమునకు జాతికిఁ గొంత మేలగును.

కావ్యమన నెట్టిదో, దానినెట్లు చూడవలయునో, అందలి రసమునను భవింప నెట్టివారు కావలయునో, ఎట్లనుభవింపవలయునో మహానుభవమునఁ జెప్పిన కవిప్రవరులు మా పిచ్చయ్యశాస్త్రిగారి కందము నిందుఁ బొందుపఱచి, వారియెడల నాకుఁగల గాఢాభిమానము నిట్లు వెల్లడించుకొని, యట్టి రసికాళికి విశేషించి నేనును పూలదోయిళులఁ బట్టుచున్నాఁడను. అనుగ్రహింతురుగాక !

" మిసిమిఁదగు కావ్యకుసుమము
కనుగందకయుండ నరసి కడు మెలఁకువఁ ద
ద్రస మనుభవింపనేర్చిన
రసికాళిం బ్రస్తుతింతుఁ బ్రణయభరమతిన్. "

నా పాండితీ జీవన వనవల్లరికి నఖండతరాదరదోహద మొనరించు సరసహృదయులు, సాహితీప్రియులు శ్రీ ఎన్. సి. ఆంజనేయులు గారికి, శ్రీ చెళ్ళపిళ్ళ బంగారేశ్వరశర్మగారికి, శ్రీ జి. ఏ. ప్రకాశ రావుగారికి నా నూఱాఱుల జోహారులు.

నర్సరావుపేట వాణీ ముద్రణాలయ యజమానులు : శ్రీ మండా ఆంజనేయులుగారు, చిరంజీవి మావిజయుని సాహాయ్యమున దొసఁగులు దొరలనీక మాతండ్రిగారిని లెస్సగానెఱిఁగినవారై, ప్రత్యేకానురాగాదరములుగలిగి, యథాశక్తి నా యీ కావ్యమును ముద్దు ముచ్చటగా ముద్రితమొనర్చి యిచ్చినారు. వారి శ్రద్ధాకృతికి నా కృతజ్ఞతా నమస్కృతి.

సహృదయ సాహితీప్రియులు, సహోదరాంధ్రు లీ కావ్యము నాదరించి, మా కితోఽధిక ప్రోత్సాహ మొదవింతురుగాక !

వినుకొండ, 5-6-64.

గ్రంథకర్త:
విద్వాన్ బీర్నీడి ప్రసన్న.

# కృతి సమర్పణ.

ఎవఁడా చావుఁ గసాయివేల్పు జనయిత్రీ! నిన్ను మాయించి నా
చివురుం గుండెలలోన నిప్పుకలువోసెన్ ద్రోహముంబూని యి
ట్లువనాయంబుగఁ దల్లిబిడ్డల వియోగాంభోధిలోఁ ద్రోసి దీ
ర్ఘవిషాదంబునుఁగూర్చు నాతనికి శృంగారమ్మ? చాదస్తమా?

కనఁడా క్రూరుఁడు మేలుఁగీళ్ళు సుఖదుఃఖంబుల్ వయోభేదముల్
తన యిష్టంబె జగంబు చట్టముగ నిత్యంబున్ జలాయించుచుం
డును, యంత్రంబులు మంత్రశక్తులుఁ దదాటోపంబు నేమాత్రముఁ
జెనకఁ జాలవు వానిచేతి దురుసిస్సీ! యిట్టులెందాకనో!

ఎవరే యంబఁట యంబ? యామె వదనంబెట్లుండు? నే చాయలన్
ఠవణించున్? ననుఁగాంచి పెంచెనె? వృథా నాకేటి కాయంబ నా
కవు సర్వంబు మహాంబ శాంభవియు నంబా! యింక నీవేనె నిన్
గవితాపుష్పములందుఁబెట్టి స్తవముల్ గావింతుఁ గావంగదే!

నీవాజబ్బునఁ గ్రుంగిపోవుతఱి నే నీసన్నిధిన్‌లేమి నీ
యావన్మృత్యువు కేనె హేతువయినట్లై నా విలాపించు నా
యావాపోకయె యీ ప్రబంధమున బ్రత్యక్షించు, మాత్రర్థముల్
భావాతీతములై సురాళికిని, విశ్వశ్రేయముల్ గూర్చుచుఁ!

భూషింపంబడె లెస్స దాసరి కులాంభోరాశి నిఁగాంచి సం
భాషింపంబడె బీరనీడి కుల విద్వత్కీర్తి నిన్నంది, యా
శ్లేషించెన్ మము నీ కుమారులఁ గళాలీలావతుల్, లేదు లే
దీషన్మాత్ర మతుష్టి మోపెకవి పత్ని! యమ్మ! సంతోషమా!

తెనుఁగుంగై తలపైనిఁ గన్ మసకలై తెల్గుంగళాపోషకుల్
కనలేకుండినసేమి ? మా ప్రతిభ నీ గర్భంబునంబుట్టువం
దిన నీముగ్గురమున్ గవిప్రభులమేనే యమ్మ ! సంతోషమా !
ఘనరత్నంబుల కేమివంక ? ప్రజ శృంగారించుకోకుండినన్.

గీర్వాణాంధ్రములందు పల్కుఁ జెలి సంగీతించు నుద్యద్యశం
బార్వఁ నా యనుజన్ముఁడౌ విజయదత్తాఖ్యుండు క్రొంగబ్బముల్
పర్వన్ జేయగలాఁడు వానిఁగని ప్రోవఁ గృష్ణరాయాభులౌ
నుర్వీనాథులు గల్గమిన్ సతము నిట్టూర్చున్ నిరాశాహతిన్.

వదరుటగాదు నా యన కృపావరదానము తేనె పాటకున్
బదనగు కైతకున్ బటుప్రవాతకు మార్దలికప్రశస్తికిన్
జదురుఁడెయయ్యు నిక్కలిని సత్కృతి యేకళకేని నోచకే
బదవలతోడ వీథిబడిపంతులుగా బ్రదుకీడ్చెడుఁగదే !

తన సర్వస్వము నిత్య మాంధ్రకవితా దాస్యార్థమే ధారవో
సెన కానీ జననీ ! తెలుంగు ధర మోషే సత్కవీశుండు నా
జనకుం డొక్క శుభోదయంబుఁగననోచఁలేకయేపోయె నా
యన కబ్బంబులు పెక్కు లింటఁబడి కట్టా ! నన్ను బిట్టేఁచెడుఁ.

కళలు క్షుధానలంబునకుఁ గ్రాగి దహించుకపోవుచుండె ల
క్షలకును లక్షలన్యముగ ఖర్చగుచున్నవి, భర్తృసన్నిధిన్
జెలి విరహంబు ! భీకరవనిఁగలగానము తల్లి ! యేమిటీ
నలువ సృజింపు లౌదలలు నాల్గయినన్ మతిలేకపోయెనే ?

కమల నను ప్రసన్ననిగఁ గానకపోయిన నేమి ? నేను తా
లిమిని సరస్వతీదయను లేమినె రంభగ గంజినీళ్ళనే
యమృతముగా కుటీరమునె హర్మ్యముగా మహినంత వింతస్వ
ర్గముగ సృజించుకొంటి జలకంబిఁక నేటికి బోడినెత్తికిన్ ?

కవనములోని మేలి నవకమ్మునుఁ గమ్మనఁజూచికాక వై
భవములు బాంధవంబులు "సిఫారసు" లౌసులుజూచి మెచ్చుచున్
గవుల బహూకరించువెటకారపు కాలములో సవిత్రి ! చి
క్కవు నను వంటి బక్క కవిగానికి గ్రుక్కెడు గంజినీరముల్ !

రసముల్ తొమ్మిది చిప్పిలంగ పృథివీరాట్సింహచారిత్రమున్
సిసలౌ హైందవ వీరజృంభణమునన్ జిన్నారి కావ్యంబుగా
ప్రసరింపన్ రచియించి యేండ్లు పదికింబైదాటె నాబిడ్డకున్
బసుపుంగుంకుమఁబెట్టు నాయకులు సంప్రాప్తింప రీనాఁటికిన్ !

పిఱుఁదులఁబట్టి పీటలను వేయు గనీబులపేర్మి దీనికిన్
దొరకదు మార్వడీ ఋణముతోడ వెలుంగున కీడ్చుకొంటిఁ బె
క్కురు రసికుల్ గలారు తెలుగుంగయితం గడు మెచ్చువారు వా
రరసినఁజాలు దీనిని; భయంపడ! నే జమసేయనన్యులన్ !

లయమైపోయిన రాజపోషణములన్ లక్షింప కీనాఁడుఁ దొం
టి యమేయాంధ్రకవిత్వమాధురులు క్రొందీపెక్క నాడాడ న
న్నయ తిక్కన్నల మించిపోవు కవిరాణ్మార్తాండు లున్నారు వా
రి యశోభ్యున్నతి కెల్లనై విరియు నా హృత్పద్మమెప్పొద్దులన్ !

అతఁడువచ్చెననుట కతఁడొచ్చెనని యిట్లు వాక్షరవిభవంబు వదలగొట్టి
అసమభాషయనుట కాధారమగు 'నణ, రఱ, లళ' వివరంబు నటికిపెట్టి
ఆకృతికొకటయ్యు నర్థానభేదించు ఖండబిందువు సొంపుఁ గాలమట్టి
భాషావిలసనంబుఁ బ్రబలించెడి ద్రుత కళాధిక్యములకు సమాధిగట్టి

ఎక్కలేరంచు ప్రజకొఱకేయటంచు
శాస్త్రకారులు గట్టిన సౌధములను
గూల్చుచున్నారు సోదరుల్ గొప్పవారు
వారి ననలేను! అనలేక బ్రతుకలేను!

దొడ్డతనపు తలగుడ్డతలను పుట్టగొడుగట్టి "హ్యాటు"ను గుస్తరించి
నగుమొగాన మెలిదిరిగి రాచకళ లుట్టిపడు మీసకట్టును దుడిచివైచి
వెడఁదయౌ నెడఁదపైనడరు నంగీ నడిమికిఁజీల్వడంగ 'టై' యొకటిగిలికి
అవయవమ్ములసౌరు నడరించు పంచకట్టునక్షుమ్మారు 'ట్రవుజరు'నురచించి

సుబ్బరావు నీ మనుమండు చూచినావె
సీమదొరగ మా యయ ఫొటో జెఱచినాఁడు
ఫ్యాషనుల కాముకుఁడు వాఁడు వానికేమి
తెలియు? మాయయ్య చక్కని తెలుఁగుఠీవి!

అది మాతండ్రి మృతించుచుండిన మహార్తాఖిలరాత్రంబు న
డెదొ! కార్యావసరాన నింటికెడమై యే దూరదేశానసో!
నిదురంబోవుచునున్న నన్ను గలలన్ మేల్కొల్పి యిల్ జేర్తు వీ
సదయత్వంబెటువచ్చెఁ జచ్చియు నమా! చాకుందు నాకుందుకై!

నీలమేఘముఁబోలి నిండారుగా మించుమెయిదాచు లేబుగ్గమేలిముసుఁగు
నడిప్రాయమునకులోఁబడి కొంతవాడినట్లగుపించుస్విన్నముఖాంబురుహము
పసిఁడికమ్ముల యురుభరమున కోపఁగఁగాక గాలికి వ్రేలు కర్ణయుగళి
బహుకష్టములనంది ఫలశూన్యతకుఁగుందువెళ్ళబోసెడుదైన్యవీక్షణములు

కలిగి సిలుగులగుతఱి నా కన్నతల్లి
చచ్చియునుఁ జాక ననుసాకు నిచ్చనాకు
ప్రాణములఁ బెట్టవచ్చెదే స్వప్నవీథి!
స్వచ్ఛ మాతృహృచ్ఛ్రీకిది సాక్ష్యమేమొ!

నీ నోటఱ దెగి యూడిపడ్డయటులే నిన్నన్నిటంబోలి య
మ్మా! నీవే యదిగాఁ బసింది పసిమిం భాసిల్లు నాచెల్లి సూ
జా నేమయ్యెనె? దానియందిపుడు లేశంబైన నీపోలికల్
కానన్రానియ దిమ్ములన్ జెరగి కాలంబెంత రాకాసిదో!

ప్రతి పద రమ్యమై చెఱకుపాలొలికించెడి శ్రీమదాంధ్ర భా
రత మపరంజివాన కవిరాజులపైఁబడునాఁడు పుట్టెఁ ద
త్కృతి కెదురెక్క కబ్బములభించునె? పిండికొలంది రొట్టె య
ద్భుతచరితాంబ! పుట్టితిమిపో! రవిపోయినవెన్క నీభువిఱ!

యక్షుల జేని పంగ్వు పులియన్ నృపులక్షరలక్షలిచ్చి య
ధ్యక్షుల జేసి నారఁట మహాకవులన్ నుతి నేఁడు వీథిలో
భిక్షము పుట్టునే కృతులు పెక్కులుసెప్పిన నేది కుక్షికిన్
మోక్షము! తల్లి! పుట్టితిమిపో! రవిచెల్లినవెన్క నీక్షితిన్

ప్రసవశరాయుధుండు మన పండితరాయలు కోరినంత ద
ద్రసమయ పద్యసృష్టికిఁ గరంగి కురంగిదృశన్ లవంగినే
యొసఁగిన పాదుపాదినము లూహకురాఁబులకాంకురావళుల్
మొసరెడు తల్లి ! పుట్టితిమిపో ! రవిక్రుంకినవెన్క నిమ్మహిన్ !

ఎదురగుచో మహా మదకరీంద్రము డిగ్గి సగౌరవమ్ముగా
"నిదె దయసేయుమయ్య సుకవీ !" యనుచున్ గరమూతయిచ్చు
హృదయములైన యాంధ్రధరణీంద్రులు వోయిరిఁ కేమి సత్కళా
భ్యుదయము ? తల్లి ! పుట్టితిమిపో రవిజాఱినవెన్క నిద్ధరన్ !

కృతులపైఁగల కృపచేతఁ గృష్ణరాజు
నేటి సుకవుల సౌభాగ్య నిధులఁగూడ
నాటి కవులకే పడబోసినాఁడొ ! యేమొ !
కబ్బములఁబట్టి సంపద లబ్బవిపుడు.

నిరతంబున్ భవదీయ దుర్మృతికి కన్నీరోడ్చు నాగుండెకున్
మొరపుల్ పెట్టుచుఁ బుట్టివచ్చినది యీముగ్ధప్రబంధంబు నీ
కరుణాంకంబున కెత్తినాఁడ నిదె ప్రఖ్యాతాంధ్రతేజంబునన్
బరమందున్ గవితాపితామహివిగా భాసిల్లుమా తల్లిరో !

జీవితమంత సత్కవన సేవకె సొంతము ధారవోసి యెం
దేవల నే 'నఘా' యెఱుఁగకే ననుగన్న కవీశ్వరుండు మో
షే వగతో జితించె నినుఁ జేరెనే ! కూర్మి మఱొక్కమాఱు మీ
రేవిధినైనఁ దల్లి ! జనియింపగ రండు తెనుంగుగడ్డకున్ !

~~~~~~~~
~~~~~~~~

# మధుమాస కృష్ణపక్షము

స్వర్గసౌందర్య సంపత్తి జల్లెడఁబట్టి పుడమిపై మరుఁదారబోసెనేమొ!
యుగయుగావిర్భూత మొక దివ్యసంగీతఝురి లోకమున సుళ్ళుతిరిగెనేమొ!
నందనారామ మందార మందానిలమ్మొరసి యీనేల నిట్టూర్చెనేమొ !
చంద్రమండల సుధాసారశైత్యముక్రమ్మి భూగోళమే గగుర్పొడిచెనేమొ!

దేవకన్యల పెదవుల తీయదనము
పూవుపూవున మధువుగా పొంగెనేమొ !
అనఁగ నింద్రియ మోహనంబగుచు వచ్చె
కమ్మని వసంత మీ కథాకాలమునకు—

గున్నమావినిఁ జుట్టుకొనియున్న లేఁదీవ
పులకరింపుల కొక్క ప్రొద్దులేదు
శిలలకే గిలిగింత గలిగించు కోయిల
పడుచుపాటకుఁ దీఱుఁబాటులేదు
తేనె ముంపునఁ దిమ్మతిరుగు తుమ్మెదతేని
పానగోష్ఠికి వేళపాళలేదు
ప్రసవాంగనల వెంటఁబడు గాలి పిల్లల
మిడిసిపాటున కాటవిడుపులేదు

విరహి లోకమ్ము నెడపెడ వేటలాడు
కుసుమ బాణుని కంటికిఁ గునుకులేదు
ప్రకృతి శృంగార విభ్రమారంభములకు
నొక యిఱుకులేదు మధుర మధూదయమున !

ఆ రాలిపడు పండుటాకుల గలగలా
రావమ్ములో దయారసముపుట్టి
ఈ పల్లవించిన యెండుఁ గొమ్మలలోన
నవనవోజ్జీవ సౌందర్యమబ్బి
ఆ మొగ్గ పరువు రక్తాశోకవల్లరి
కైసేతలోన శృంగారమబ్బి
ఈ దిగ్దిగంతములేలు పుష్పాడి దుమా
రమునుండి నవసుగంధములుతెరలి

వివిధ భావమ్ములొరసి యుద్విగ్నమైన
సుకవి హృదయమ్ము పోలిక ప్రకృతియెల్ల
ప్రతి పదమ్మునఁ దన్మయత్వము భజించె
మధు విశేషమ్ములేక మైమఱపుగలదె ?

పరమ పదమ్ముకోసము ప్రపంచము రోసి యెడారిదారులం
బెరిగిన యోగు లీ చిలిపి వెన్నెలలో మదన జ్వరమ్ము ము
మ్మరమయి గింగిరాల్ దిరిగి మౌనముగా దిగజాఱి. రెంక నె
వ్వరు తలక్రిందుగాడు ? రసవన్మధుమాసముసేయు మాయలన్.

వృక్షాగ్రంబుల మాటిమాటికి ఒడాయిం జల్లటీల్గొట్టి దే
హక్షోభమ్మును దోపనీక మొనగాడై ముద్దుటిల్లాంద్రకున్
జక్షుఃపర్వము సేయుచుండె కపివంశస్వామి ; యెవ్వండు స్వీ
యక్షుద్రత్వము బైటవేసికొను భార్యా సన్నిధానంబునన్ ?

తన ముఖవర్ణమా ? యెఱుపు ; దానికి తోడొక తీయదొండపం
డును గొనివచ్చెచో నెవతెనో పతి కౌఁగిటఁజేర్చుకొన్న వాఁ
డని యొక కీర సుందరి గయాళిది కస్సున లేచిపోయె నె
మ్మన మెటు నిబ్బరించు ననుమానపిశాచము పూనువారికిన్ ?

నవలావణ్యము రాశిపోసిన వసంతారామ మధ్యమ్ములో
కవి యొక్కండు కవిత్వ వస్తువులకై గాలించి యచ్చోట పు
ష్పవతుల్ కోమలమాలతుల్ వలపు సూపన్ మ్రానుపాటొందె చి
త్ర విచిత్రాంశము లిట్టి వేర్పడక చైత్రం బెట్లు చైత్రంబగున్?

అతఁడేమో రసరాజ్యనాయకుఁడు, తానా? రాగమంజూష, పై
నతనుం డందలమెక్కురోజులవి యాహా ! యేమి వైరాగ్య ప
ద్ధతి? యా తుమ్మెద కల్ల సంపెగకు బద్ధద్వేషముల్ మీరి భా
రతమంతైనవి యాఱు వీ సహజవైరజ్వాల లేకాలమున్.

అంద మెగపోయుచున్న దుద్యానవీధి
మిసమిసలుగుల్కు శైరీష కుసుమపంక్తి
అమ్మ యొడిలోన వెన్నెలలారవోయు
పాల పాపాయి చిఱునవ్వు జాలువోలె !

మలిసఁజన్ జిలుగాలి వీవనల సన్మానింప బంగారు తీ
గలువోలెన్ సరిక్రొత్త నాగరిక శృంగారమ్ముతో రంగురం
గుల చీరెల్ ధరియించి తెన్గుదొరసానుల్ పట్టణాంతర్వన
స్థలిఁ గ్రీడించెద రామనిన్ ప్రియుల పజ్జన్ ముద్దుముచ్చట్లతో.

ఆ మధుమాసలక్ష్మి కిఁకవైన యొకానొక నవ్యనందనా
రామములోఁ బరిమళ పరంపర తామరతంపరైన యా
కోమల మల్లికాకుసుమకుంజము చల్లని నీడనున్న శో
భామయి యెవ్వ? రంబుదము ప్రక్కలమించు టొయారిపోలికన్.

చెంపకు చేరెడై పరవశించిన యానను సోగకన్నులన్
గుంపులుగట్టి నల్దెసలకుం బరువెత్తు కటాక్షముల్ మన
స్సంపుట గుప్తరాగరససంపదతోడి యదృష్టలక్ష్మికిన్
బెంపుడుబిడ్డఁడౌ నెవనిమీఁద నమాంతము గ్రుమ్మరించునో!

కదలెడు పూలగాలితరఁగల్ పయిపైఁబడి నీలిముంగురుల్
చెదరినఁ జక్కనొత్తదు ఫలింపని యే మధురాశగుండెలన్
మెదలునొ! యంతలో దిగులునీడలు వ్రాలును గ్రాలునంతలోఁ
బెదవికొసన్ తళుక్కుమనిపించు దరస్మిత మామె మోమునన్.

ఒకతూరి చూపుక్రిందికిదించి తనచేతి
గడియారమును కాలమడుగుకొనును
ఒకసారి హృదయమ్ము నుయ్యాలజంపాల
లూపు నూహలకు నిట్టూర్పుఁబుచ్చు

ఒకమాటు పొదమాటునకుఁ జేరి పావురాల్
ప్రేమించుకొనుట కబ్బిళ్ళుగొలుకు
ఒకమారు సుకుమార శుకశారికాగీతి
కర్థమన్వేషించు నట్లుదోచు
మేలుకొనినట్లెయున్న యా వాలుఁగనుల
నొక్కపరి స్వప్నమాధురు లొలుకపోయు!
సెకలు సాగించుచున్న దా చిన్నదాని
ప్రతి పద స్పందమున కన్నెపరువమిట్లు.

తీవ్ర విరహజ్వరమువంటిదేదొ తగిలి
తగులఁబడిపోవుచున్నదో! చిగురుగుండె
వలపుఁగమ్మని నునుతావి యలలువారు
నామె యూర్పున కెచ్చటిదంతవేడి ?

అపు డీడేరినపిల్ల, దయ్యపర సంధ్యాలక్ష్మి శృంగారపుం
దపనః గ్రాగి సరాగయై యినుని హస్తస్పర్శలో సోలు ప్రా
యపుఁదీరుల్ గమనించుచుః గరగి నీరైపోవు నక్కన్యకా
విపులస్వాంతముఁజుట్టి పొర్లఁబడిపోవే ? ప్రేమపాథోనిధుల్.

అది యేదో యతిలోకవస్తువునకై యారాటమా ? యాఱుము
ప్పది సూపెః గడియార, మా యెదుర్వ్రోవల్ సూచు నుత్కంఠ మా
నదు తా, నంత ప్రశాంతశీతల సుగంధస్యంది మందానిల
మ్మెదకుఁన్ బిల్పయిసోక నొక్క యువకుండేతెంచె నచ్చోటికిన్.

అతఁడు నవ్యనాగరికు, డందము వాని మిరాసి, ప్రాయమా ?
పాతిక వత్సరమ్ములకు పైబడ, దాంగ్లకళాప్రభావ మా
చేతముమీఁద నెంతపనిచేసెనొ! కాక స్వజాతిపైని సం
ప్రీతి నశించెనో! తెలుఁగుమీరిన వాతని తీరుఁదీయముల్.

మొకమేమో పదియాఱణాల్ తెలుఁగు పొల్పుంచెల్వు, నాపాదమ
స్తక, మా వాలక మల్ల తెల్లదొరదర్జాకించితయున్ వెల్తిగా
దకటా! యచ్చతెనుంగుతత్త్వమిటు రెండుందాలదై యుట్టికె
క్కక స్వర్గమ్మున కెక్క కీ నడుమ నూగన్సాగె హాస్యాకృతిన్.

చిన్ని నగవొండు వెన్నెల చినుకువంటి
దతని పెదవులఁదొణఁకెఁ బ్రేమాంకమగుచు
నప్పుటమ్మైన యొక పౌలయలుకదక్క
నామె మొగమున నవ్వు రవ్వంతలేదు.

అతఁ డామె గాథ పరిచితు
లితఃపురాన్యోన్యరక్తు లీనడుమ నెదో
హితవుసెడి వేరుబడి మఱి
కుతూహలము తిరుగ కలసికొనిరో యిపుడున్!

చల్లని మల్లెపూల పొదచాయల మౌనముఁబూనియున్న యా
పల్లవపేశలాంగి తలపై నొకదోసెడు నారవిచ్చుపూల్
చల్లెనతండు సిగ్గుఁదెఱజాఱిన కన్నులఁజూచిచూడ న
ల్లుల్లము పల్లవింప మధురోష్ఠి మఱీమఱిచూచె నాతనిన్.

ముద్దుగా నాతఁడప్పు డాముద్దరాలి
స్నిగ్ధ కబరీభరమ్ముపైఁ జేయివేసె
ఆ సుఖస్పర్శ నాత్మ నిట్టట్టు కదుపు
కలవరము నాగి యామె యవ్వలకుజరిగె.

పులుఁగుజంటలు తరునీడముల వసించి
గుసగుసలువోవుచున్నవి మసకసంజ
హృదయములు విప్పి యా ప్రియాప్రియులు గూడఁ
బలుకుకొనసాగి రిది వారి వాక్యఫణితి —

ఏమది వంచుకొన్న మొగమెత్త విదెక్కడిమూగనోము ? నీ
క్షేమ విశేషముల్ తెలియఁజెప్పవుగా ! యనుకొన్నవేళకున్
రామికి నెంతవేగితివొ నాసఖి ! యీ యపరాధిమీఁద నీ
ప్రేమ కటాక్షముల్ విసరివేయుము పుష్పశరాతితీక్ష్ణముల్.

ఎప్పటిదాక నిట్లె ధ్వనియింపులుసొంపులులేని వట్టి యీ
చప్పటి ముగ్ధ నృత్యము? రసస్వరగుంఫిత నర్తనాంతరం
బిప్పటికైన నారసి సఖీ ! మెయివంపులతో మరందముల్
చిప్పిల నాఁకపింపుము ప్రసిద్ధముగా మధురానురాగముల్.

ఏ చివురాకుమేతలకొ తృప్తివహించి కషాయకంఠమున్
జాచి కుహూకుహూయని ప్రశస్తిగఁబాడునదే పికంబు ! కాం
తా ! చవులూర నీ మృదుసుధాగళమున్ శ్రుతిఁగల్పు మెందుకే
దాచెదు భావజప్రచురతాండవ మీ మధుమాసవేళలన్.

తుమ్మెదకోడెగాని మధు తుందిల ఝుంకృతిగీతికా వినో
దమ్ములఁ దేలి తేలకయె ధారుణిఁబడ్డది వృంతమూడి యా
కమ్మని కన్నెపూవు; మఱుగంటకు నీ సొబగేమియౌనొ ? యో
యెమ్మెలరాణి ! నమ్మకొనకే కనరాని భవిష్యదర్థముల్.

ఆమె —

ఒకయేడాది గతించిపోయినది, యేదో స్వప్నవృత్తమ్ము పో
లికఁ గన్పట్టు పురారహో మధురకేళీఘట్ట, మా ప్రేమచం
ద్రిక దుఃఖాబ్దపరీతమై హృదయ మంధీభూతమైపోయెనో
యి ! కఠోరప్రియశీల ! యీమె యెవరో యేమైన గుర్తున్నదా ?

హృదయమున చేదు కనిపింపనీని యింత
పెదవి తీయని మాటతీరొదవకున్న
నొక పరస్త్రీ మనస్సు దోఁచుకొనిపోయి
ఏమొగముఁబెట్టుకొని వత్తు విట్లు తిరిగి ?

వలపుల వెన్నెలల్ వఱదవాఱు వసంత రసోదయమ్ములోఁ
గలవర రాగగీతికలు కమ్మని కంఠమునెత్తిపాడఁ గో
యిల యిపుడాగమించినది, యే యెలగొమ్మల చాటుమాటుగా
కులుకుచునున్న దింతవఱకున్ బహుకాల వివాసముగ్ధయై ?

ఆయెనుబోయె నాఁటి ప్రణయమ్మిపు డంకెకురాదు, శూన్యమై
పోయిన మబ్బులో మెఱపుబుట్టునె ? యే నవమోహనోదయ
ప్రేయసి యేడ్చునో ! విజనవీథుల నీకయివేచి ; పోయిరా
వోయి ! సుఖింపు క్రొత్తవలపుల్ ఫలియింపగ పండువెన్నెలన్ !

ప్రళయమహోగ్రకాలశిఖివంటి వియోగముఁగూర్చి నన్నిటుల్
చులకనజేసిపోతి వనుచుణ జెలియేడ్చెఁ గలస్వనమ్ముతో
జిలిబిలి వీణెపాటవలె; చేరెడు నా యరమోడ్పుఁగన్నులన్
నిలిచిన బాష్పధారలకు నిల్వనినీరయి యాతఁ డిట్లనున్.

జాఱెడు బాష్పబిందువులు సన్నని వంపునఁదీరి ముత్తెపుం
బేరయి భారమై హృదయవేదనసేయునొ! ముద్దరాల! నిం
దారచనామిషణ విరహనాయికపోలిక విప్రలంభ శృం
గారము జూపినావితని కౌఁగిఁటి ముద్దులు నీకుఁగానుకల్!

నీవు తలదాల్చు నొక చిన్ని పూవురేకు
ఇంత నలిగినఁ గ్రుంగిపోయెదవుగావొ!
గుండె గుదిలించు భయద వాగ్గుంభనమున
నీహృదయవాసి నెట్లు హింసించినావు?

అకడనీకడన్ దిరిగి యామని నాటికిఁ జేరుకోకిలన్
నాకుపమానవస్తువని నా వెటుపోయిననేమి? కీర్తిరే
ఖాకమనీయ జీవన వికాసముగల్గిన; నాల్గుగోడలే
లోకముగాఁదలంచు సుఖలోభులు కుక్షివినోదికాకముల్.

ఒక్క యేడాదికే బక్కచిక్కిపోయి
గాఢమగుప్రేమ స్వప్నమై కానఁబడునె?
చంద్రికకు మైలపోకునే జలధరమ్ము
క్రమ్ముకొనివచ్చు! గాలికిఁ గరఁగిపోవు!

ఒక గడియ సేవు పడిన వియోగతాప
మవలఁ గొనివచ్చు మంచుకొండంతసుఖము
ఇరువురము పంచుకొందము; విరహబాధ
ప్రణయవజ్రమ్మునకు సానబట్టుసుమ్ము !

అకలంకమ్మఖిలమ్ము మచ్చరిత మా యమ్మాయి యేయింటి దిం
తకు ? నాకున్ జతసేయుచుంటి వనుమానవ్యాధి మీ యాడుజా
తికి తోఁబుట్టిన, దొక్క సీమనసునందే కాదులే, యైన ప్రే
మకథాఘట్టము రక్తికట్టదది యీమాత్రమ్ము లేకుండినన్.

కమ్మని పారిజాత సుమగంధము కోపగృహమ్ము నల్గడన్
గుమ్ములుగుమ్ములై యెడఁదకున్ గిలిగింతలుసేయ సత్య క్రో
ధమ్ము నటించు ఘట్టముగదా కథ కాయువు తిమ్మనార్య కా
వ్యమ్మున; స్త్రీల కిట్టి పొలయల్కలసూయలు నస్త్రశస్త్రముల్.

ఊఁబట యేది ? కాలమున కొక్కొక చక్కనిచుక్క నల్లదే
పేరున పేరునన్ నిలువఁబెట్టి నభస్సున చందమామ జా
గారము సేయవచ్చెఁ దమకమ్మున; వెన్నెల మల్లెపందిరుల్
తీరిచినట్లుకాసె సుమదేవి ! యొకింత సుఖింపుమిప్పుడే !

ఇప్పటికి స్తనశల్యపరీక్ష చాలు
నీ మధురరాత్రి మనవంటి ప్రేమికులకు
గంటలకొలంది ముచ్చట్లకంటె నొక్క
ప్రణయమయమైన క్షణిక చుంబనము మెఱుఁగు.

సుమదేవి: —

చలి కొండంత సుఖమ్ముఁదెచ్చు విరహజ్వాలాలవమ్మంటి పీ
బులుపుంబోకడకేమిగాని అలిబాబూ! యొక్క వర్షమ్ము నీ
వలె నేనుం బయిపై విహారములకుం బాల్పడ్డ నేమౌ? మహా
ప్రళయమ్మేగద? చూడు! స్త్రీ పురుష ధర్మంబెంత వ్యత్యస్తమో!

పరదాగాఁదిరుగాడవచ్చునఁట స్వేచ్ఛాజీవులై పూరుషుల్
పరదాచాటున, వంటయింటి చెఱసాలన్ గ్రుగ్గి, నారీమణుల్
నరకమ్మందుట పుణ్యహేతువఁట యన్యాయ్యమ్ము లీచట్టముల్
కలకుం జట్టములై సతీజన కళాలాలిత్యమాకట్టెడుఁ౯.

మేమొక కామయంత్రములమే యయినాము స్వతంత్ర చేతనా
స్వామితలేని యీబ్రతుకు భారము నెన్నితరాలు మోయునో
మా మహిళాప్రపంచము ప్రమాణబలిష్ఠములై శ్రుతిస్మృతుల్
మీ మగవారివైఖరుల మెచ్చు, నియంత్రతఁ దెచ్చిపెట్టుచుఁ౯.

దారులు కానరాక ధ్రువతారలులేని విచిత్రనౌక యే
తీరునఁజేరునో జలధితీరము! నావికు లెల్లువోదురో!
గౌరవముఁ౯ స్వతంత్రతయుఁ గానక స్త్రీ లణగారునాఁడు సం
సారశతాంగ మెక్కడగుసాగునె వీరల యొంటిఱెక్కపై?

ఉడుకునెత్తుటఁ గత్తిగడిగి సింహాసన
మ్మధివసించినది రుద్రమ్మతల్లి
తెలుఁగువీధులు క్రొత్తవెలుఁగు ముగ్గులతో
నలంకరించినది మొల్లమ్మగారు

మగఁడు యుద్ధముమాట మఱచుచో వీర గం
ధమ్ము పూసినది పల్నాటిపడుచు
పురముపైఁబడు తెల్లదొరల ఱొమ్ములు గ్రుద్ది
నిలువరించినది బొబ్బిలివధూటి

హృదయమును జీల్చికొని ప్రజాభ్యుదయమునకు
ప్రాణమర్పించి రెందఱో భాగ్యవతులు
ప్రతినిమేష ప్రభా సమున్నతములైన
స్త్రీల చరితల వ్యర్థశీర్షికలు గలవె ?

ముగిసిన వెన్ని దీర్ఘయుగముల్ ? భరతాంగన నిండుగుండెలో
రగులు పరాభవాగ్ని యొకరవ్వ శమించెనె ? తీవ్రభావనా
విగళితమైన యీ హృదయవేదన దాచుకొనంగలేక నా
దిగులిటు వెళ్ళబోసితిని తెచ్చితి క్లిష్టసమస్యఁ జర్చకున్.

నీవే దైవముగా మనఃపరిధిలో నీ ధ్యానమేయై యసల్
దైవధ్యానము మానుకొన్న ప్రియకాంతన్ నన్ను వంచించి నీ
త్రోవన్ నీవటుపోయి చూపితివి నీదుష్యంతవేషమ్ము నీ
నా వృత్తాంతము పంచమాంకమునకున్ రాలే దదేచాలులే !

అలిబాబు :—

మీ స్వేచ్ఛా ప్రతిబంధకమ్మిపు డదేమీలేదుగా ! యేమిటో
స్త్రీ స్వాతంత్ర్యము చచ్చిపోయెనని నిర్వేదించినావింత వీ
రస్వర్గీయులు కందుకూరి ప్రభృతుల్ వైష్ణవ్య శంఖమ్ములన్
నిస్వానించిననాఁడె మేలుకొనియెన్ నిద్రాణ సంస్కారముల్.

పిలిమబ్బులముందు నిలిచి యక్షునిబోలె
విరహదుఃఖావేశ మెలుకజేసి
మనయూరిమీఁదుగా మలయు చల్లనిగాడ్పు
టలల నీయూర్పు గుర్తులను వెదకి
ప్రతిపదార్థమున బింబితమైన నీమోహ
నాకారమును కన్నులారఁజూచి
ఏ పిల్పువిన్న నీహృదయగానమ్మట్లు
తలపోసి పరవశత్వమునఁదోగి

నీవలపె నీతలఁపె నన్ను నావరింప
కాలునిలువక దూరదూరాలనుండి
వచ్చి వ్రాలితి నీపదాబ్జములమ్రోల
స్వచ్ఛతరమైన ప్రేమకుఁ జావులేదు.

ప్రణయోద్యానపుఁ బూవుఁ దీవలయి యద్వైతమ్ము సాగించుటే
మన కర్తవ్యముగాదు నిత్యపరిణామభ్రాంత లోకమ్మునన్
మనమేమౌదుమొ! రేపగాధమగు విజ్ఞానైకభాండార మం
దణువైనన్ గడియించుకోవలదఁటే యాయాప్రయత్నంబులన్ ?

నవనవోన్మేషమైన విజ్ఞాన కాంక్ష
మానవుఁడు నిల్వఁడొకచోట మ్రానువోలె
గగన భూమండలమ్ములఁ గలయఁదిరుగు
కవి మనస్సున కొక కళంకమ్ముగలదె ?

మన పూర్వాంధ్రవసుంధరన్ గని నిలింప స్వామి గ్రుక్కిళ్ళు మ్రిం
గినవాఁడంద్రు మహాకవుల్ తెలియ కీ నిర్భాగ్యకాలమ్మునన్
దనువుందాల్చితిఁ బేరుమ్రోగిన చరిత్రస్థానముల్ చూచివ
త్తును, తత్సారభలేశమే ననుభవింతున్ గ్రుడ్డిలోమెల్లగా.

అను నూహాంకుర మొండు నామనమునం దానాటికానాటికిం
బెనుపై వేగిరపెట్టసాగినది నామిత్రుల్ కళారాధకుల్
మునుముందై ననుఁ బ్రోత్సహింప నల " యెల్లోరా, యజంతా "ది శి
ల్పనిధుల్ చూచి సుఖించు నాకు నొక కాలజ్ఞాన మెట్లుండెడిన్ ?

నీ హృదయమ్ము ప్రేమరసనిర్ఝర మా జలపాతమంటి నా
యూహలు తల్లక్రిందులగునో! యని నీకపుడాప్రయాణ స
న్నాహముఁ దెల్పనైతి నిను నాజతగాఁ గొనిపోదునన్నపై
స్నేహితుఁడుండి రైన పయనింతువె మావలెనీవు ? కోమలీ !

తెలుఁగు శిల్పులు ఱాలు మలచి జీవముపోసి
సృష్టిచేసిన హంపి శిల్పనగరి
ప్రాచీన భరతవైభవము వన్నెలుదేలి
తలయెత్తుకొన్న ముంతాజమహలు
ఆకాశశిఖరాలు తాకి యాంధ్రౌన్నత్య
మును జాటు పెనుకోటబురుజుగుములు
ప్రతి పదమ్మున బుద్ధభగవానుఁడగుపించి
కరుణఁబుట్టించు నాగార్జునాద్రి

కర్కశ కరాళ కాలచక్రాలక్రింద
చిదికిపోక జాతీయతఁ జెదురనీక
నిలిచియున్న చారిత్రిక స్థలములరసి
ఒడలు పులకింపఁ గొన్నాళ్ళు గడపినాఁడ.

చండాంశుప్రభలై ప్రతాపములు రెచ్చున్ వైరి వక్షాలపై
జెండాల్ నాటి పురోగమించినది ప్రాచీనాంధ్ర, మా శౌర్యపుం
భాండారమ్ములు త్రవ్విచూపు మన పూర్వక్షేత్రముల్ కన్నచో
గుండెల్ పొంగి జనించుఁజుమ్మ సమశక్తుల్ నూతనోత్తేజముల్ !

నేను పురాచరిత్ర రమణీయములైన స్థలాలలోన కా
లూనినవేళలందచటి యోధులతోఁ జెయిగల్పి దాస్యకా
రానగరీ కవాటములు బ్రద్దలుగొట్టి ప్రజావిముక్తికై
ప్రాణము ధారవోసినటులైనది ధన్యుఁడనైతి నింతకున్.

ఒకయెడ దేశభక్తి మఱియొక్కయెడన్ విషయానురక్తి నన్
జకితునిజేసి జీవితమునం దొకకమ్మని యూహ రేపునో
సకి! యిటు తేనెవాక! యటు చల్లని యాసవపాత్ర! దేనితో
సుకపడుమందువో! కదలుచున్నది యీ హృది పూఁడోలయై.

నీకలహాస కౌముదులు నిండిన నానయనాంచలాలలోఁ
జీఁకటిజాడలేదధివసింపుము నా హృదయాంగణమ్ములో
నీకు సువర్ణవేదికలు నిల్పితి; ప్రేమతపస్సమాధిలో
నేకముచేసికొందమిఁక నీ విడిపోయిన యంతరాత్మలన్.

ఏ సుఖసౌరభమ్ము విరియించునొ! రేపను మల్లెమొగ్గ ని
ర్వాసితమైన నిన్నటి యపాయముఁ ద్రవ్వుటయేల? నేటి యు
ల్లాస ముపాసమున్న నవలన్ మనకందునె? రమ్ము దుర్దినా
యాసముఁ దీర్చుకొందము ప్రియా! నవజీవన నందనమ్మునన్.

ముల్లోకమ్ములచేత బ్రహ్మరథమున్ మోయించుకొన్నట్టి నా
తల్లిన్ దెల్గు ధరిత్రిఁ గాంచెడు పవిత్రాకాంక్షయేగాని యే
చిల్లాపల్ల యెఱుంగ దీ తలఁపు నిన్ సేవించుఁ గాకున్న నా
యుల్లమ్మిట్లన చీల్చి చూచుకొనరాదో! నీకుఁ జాటున్నదా?

పాపము నా వియోగదురవస్థల దుఃఖపు టుక్కపోత కె
ట్లూపిరి ద్రిప్పుకొంటివొ! కృశోదరి! నీ కనుపాపలందిఁకన్
గాపుర ముందులే! యచట నా ప్రతిబింబములేనినాఁడు నీ
కోపము శాపమై వలపు గుర్తులకున్ జిటిపేర్చుఁగావుతన్!

ఈలోకమ్మున మాతృదేవతకు నీకేగాని నాలోన జా
గా లే దన్య కథాప్రశంసలకు నీ గాఢానురాగ ప్రధా
నాలోకమ్మొక స్వర్గ. మమ్మయొడి బ్రహ్మానందరాజ్యమ్ము త
న్మూలమ్మై సెలవైనచో వదలుకొందున్ బ్రాణ సర్వస్వమున్.

అతిశయార్థమంటి నను కొంటివో యేమొ!
అడిగిచూడు మిష్టమైనకాన్క
మన మనోనురాగమునకు లాంఛనముగా
పుణికితెత్తు గగన పుష్పమైన.

ధ్రువ వసిష్ఠాది సాధుల వేదపాఠమ్ము
ఊకొట్టుచున్న యీ యాకసమ్ము
ప్రేయసీ ప్రియులకు వెన్నెలకట్నముల్
చదివించుచున్న యీ చందమామ
తెప్పగొట్టక లోక వృత్తమాద్యంతమ్ము
పడి చూచుచున్న యీ యుడుగణమ్ము
జీవకోటిని చీమచిటుకన్న నాలించి
పాలించుచున్న యీ పంటవలఁతి

ప్రకృత సాక్షులు సుళువుగాఁబలికి బొంకి
తప్పుకొనరాదు నాకు ముద్దాయితనము
తెలుపుమిఁక నీ తలంపు కావలయునన్న
నఱకి నీచేతికిత్తు నాశిరమునైన.

సుమదేవి :—

మేలుసఖా! మహాశపథమే గయికొంటివి— వట్టి మాటతో
తేలదు లోని నిగ్గడిగితీరెద నిన్నొక కాన్క; సత్య వా
క్పాలన కందెవేసినదిగా! మన యాంధ్రుల చేతివాసి! యా
చాలునఁ బుట్టి నేఁడు టిగజాఱవుగా సగమీతగాఁడవై?

నీవొక కళాతపస్వివి నీమనస్సు
మాతృదేవతోపాసనామంటపమ్ము
కలదె యచ్చోట ప్రణయపూజలకు తావు?
చెఱ నడుమనుండి కౌఁగలిఁచెదవె నన్ను?

పద్మమండలి వలచిన భానుమూర్తి
కొలను తలమీఁద చంద్రు నిప్పులను జెఱగు
ప్రకృతి గత లక్షణము స్వార్థపరత యనుము
పాప మనుమైన నది రద్దుపఱుపరాదు.

ఏమి యపస్వరమ్ము వినియెన్ జెవి? నెత్తురుచుక్క లేదు నీ మోమున నప్పుడేబెదరిపోకుము సాంతము జెప్పనిమ్ము నీ ప్రేమ నిరూపణమ్మునకు వేళసుమీ యిది! తూలిపోక యి సామున నెగ్గిచూడు మన చాకిరికత్తెలు పై నదృషముల్ !

ఎల వెన్నెలలలోన నిసుకతిన్నెలమీఁద
చెలికౌఁగిలింత కాసింతువేని
సార్వభౌమతకన్న సత్యరక్షాదీక్ష
విలువైనదని సుంత తలఁతువేని
ఉన్న రెన్నాళ్లు ప్రేమోపాసనమ్ములో
మనసు పండింప సమ్మతమయేని
అఱుమూడైనఁ బ్రేయసి ముద్దుఁజెల్లించు
నుద్దేశమొకటి నీకున్నదేని

ఒక్కరవ చేదు తెలియరాకుండ బ్రతుకు
గిన్నెలో స్నేహరసమె పొంగింతువేని
సంహరింపుము నీవు నిస్సంశయముగ
కన్నతల్లిని మన పానకమునఁబుడక.

ఇదియొక మానవాకృతి ధరించిన ఘోరపిశాచి దీనికిన్
హృదయములేద యందువా! మతేమనుకొందువా! గుండెలోతులం
దొదిగిన కోర్కె పై కుబుకుచున్నది భావి సుఖప్రదాయి యి
య్యది, మన ప్రేమసౌధమున కాతలఁటాయి పునాదియయ్యెడున్.

అని హృదయేశు సన్నిధి నొయారముగా నొక వింతనవ్వు న
వ్వినది లతాంగి; బాకులొకవేయి మనస్సున నాటినట్లుగా
వణఁకె జెమర్చెమేను తలవాలిచె నున్నటులుండి మూర్ఛలో
మునిఁగెనతండు కొన్ని క్షణముల్ తన మాత్రభిమానమెట్టిదో!

ప్రణయమోహిని ప్రళయవాహినిగమాఱి
ప్రాణ బలిదానమడిగె నిర్భయతఁబ్రియుని
కుసుమ కోమలమగు నామె గుండెలోన
కలదు కాఁబోలు శైలకర్కశతగూడ.

ఆమె చేలాంచలాల మందానిలాలు
సోకి మెల్లన కనువిచ్చి చూచెనతఁడు
ఉష్ణదీర్ఘమ్ము లతని నిట్టూర్పులొరసి
యార్ద్రమైనది యచటి వాతావరణము.

అలిబాబు :—

ఎవ రీ కన్నులముందునిల్చినది నీవేనా? ప్రియారూప మ్మ
త్యవు నాతోఁ జెలులాడుచున్నదనుకొందున్ గానిచో ప్రాణబాం
ధవియౌ చల్లనితల్లి గొంతునులుమన్ నన్నిట్లు మేల్కొల్పు వా
రెవ రీ నాటికి విశ్వభీకర కథా హిందోళ మాలించితిః.

ఒక గయ్యాళితుఫాను మున్ గలను న న్నువ్వెత్తు నాలేపి స్వా
ర్గిక సౌందర్యముఁజూపి చూపకటులే క్రిందంబడన్ద్రోసె నా
వికృత స్వప్నగతార్థ మిప్పటికి గన్పించెన్గదే! దర్పణ
ప్రకటీభూతపిశాచిమూర్తివలె నీ బాంధవ్యమీపాటివా?

ఈ సువిశాల సుందర మహీవలయమ్మను చిత్రశాలలో
నే సుమనోజ్ఞ సృష్టి చివురెత్తునొ! మోహపుఁగారుచీకటుల్
మూసి మనస్సులో నిలిచిపోయితి వంధుఁడనైతి చాలదో
యీ సహనమ్ము? నీలితెరలింకను గట్టెదవేమి కంటికిన్?

ఏల మధియింతు విట్లు నా హృదయజలధి
భయద విషభుగ్నమగు బాడబాగ్నికొఱకు?
ప్రేమ బలిగోరునని పల్కు పెద్దతలలు
త్వచ్చరిత్రకు నిదియ టిప్పణమునుమ్ము!

ఈ జగమంత ప్రేమమయమే యనుకొంటిని క్రౌర్యకాళిమల్
బూజులుపట్టి పాపములు పుచ్చిన మాయబజారుఁ జూచి, నీ
నైజము నేటికిన్ దెలిపినావు నమస్కృతి! నీకుఁ బ్రేమనీ
రాజనమెత్తితిన్ గటికెఱాతికి చక్కిలిగింత పెట్టితిన్.

ఈ పైశాచిక రామణీయకము నన్నేడ్పించి నాలోన నే
వో పొంగించు రహస్యవేదనలు నే నున్మాదినైపోదు నా
శాపక్షమ్ములు కట్టువడ్డ వికలస్వాంతమ్ముతో జీవిత
మ్మే పాతాళ నిశాశ్మశానములకో యీడ్చున్ మహోద్రేకముల్.

మాతృపరమైన కుటిల సంభాషణమ్ము
కర్ణముల నాటుకొనియు నా కలకుగుండె
గ్రక్కదలిపోదు ! ప్రిదిలి ముక్కలునుగాదు
మానవత్వము చంపుకొన్నాను నేను.

మఱచిపోలేను నిన్ను, నీకొఱకు మాతృ
దేవి రక్తము నేలఁజిందింపలేను
కలుషభావతరంగ సంఘర్షణమున
నేను చావక బ్రతుకకున్నాను నేఁడు !

పాలిననేలపైఁ బసిఁడివానలు నింపెడు నీలిమబ్బులో
జాలియెడంద, యోషధిరసాల్ చిలికించెడి మంచుకొండలం
దేలు సుధాశిశైత్య మొకటేమిటి ? విశ్వము రూపుగొన్న ప్రే
మాలయ దివ్యతేజముగదా ? జనయిత్రిని హత్యసేయనా ?

ఓసి శిరీషపేశల రసోజ్జ్వలమానస ! చాలులే పరీ
హాసము ! స్నిగ్ధముగ్ధ మమృతార్ద్రమునైన మనస్సులో విష
న్యాసము ! కన్నతల్లి హృదయమ్ము నెఱుంగని వెఱ్ఱిదానవో
నాసఖి ! యాలకింపుమొకనాటి విశేషము నాచరిత్రముఁ !

నాన్న కనుమూసెనఁట నే
కన్నుఁదెఱచి పుడమిఁబడిన కాలమ్మునె
కన్నీటి పడకపై నా
చిన్నతనము గడచిపోయె శీతాంశుముఖీ !

తండ్రి మరణింప నాస్తియంతయు నశింప
కష్టదశ కగ్గమయ్యె నా కన్నతల్లి
ఆకురాలి పూవులువాడి యడవినడుమ
దిక్కుమాలిన చిట్టిమల్లె తీవవోలె!

అమృతముఁ దెచ్చిపెట్టినదా! యన్నమె పెట్టినదో! దరిద్రతన్
గుమిలి కృశించుచున్నను, ననున్ సుఖడోలలడిగ్గనీక ప్రా
ణమువలె జూచిపెంచుకొనె నా జనయిత్రి; దయార్ద్రమైన యా
యమ హృదయమ్ములోఁ దిరుగులాడని తావులులేవు వీనికిన్.

ఆటలాడి పాడి యలసి యింటికిఁజేర
కడుపుఁదడవి చూచుఁ గన్నతల్లి
భౌతికమ్ము లన్నపానీయములకన్న
నమ్మ చేతిచలువ యధికతరము.

ప్రాణముపొంగు మాతృహృదయమ్మను క్షీర మహార్ణవమ్ముపై
నేను శయించెదన్ బ్రళయమేయగుగా కచటం బ్రశాంతికిన్
గానఁగరాదొకింతయువిఘాతము తల్లి కవుంగిలింతలో
నేను మహేశ్వరత్వము వహింతుఁ దరింతు దురంతదుఃఖమున్!

భాసిలుచున్న యమ్మ కనుపాపలు నా విహరించు స్వర్గ కై
లాసములెంత రక్కసితలంపిది? మాతృపదంబుజార్చనా
గ్రేసరునిన్ గసాయిపనికిన్ దిగుమందు వొకప్పుడంగనల్
దోసిఁటి పూలగుత్తు లొరదూసిన కత్తులు వేఱొకప్పుడున్.

ఐదో నేఁడనుకొందు ప్రాథమిక విద్యాశాలలోఁజేర్చి జ్ఞా
నాదర్శుండగు పంతులయ్యకడ "ఓనామాలు" నేర్పించి నే
నెదో లోకముఁ నుద్ధరింతునని యూహించెన్ బ్రసూదేవి నా
యీదౌర్భాగ్యదశల్ తలంచుకొని నేఁడేడ్చున్ దివారాత్రముల్.

అక్షరవిధమ్ముఁ దెలిసి శబ్దార్థమెఱిఁగి
భావములు గూర్చి వాక్యకల్పనమొనర్చి
ప్రౌఢ కవితలు చదివి శాస్త్రముఁ గ్రహించి
అలవరచుకొంటి సారస్వతానుభవము.

ఈదులాడితిని సంస్కృతకవిత్వాంభోధి
నాణిముత్యాల మెట్టందువఱకు
పట్టిచూచితి కవిబ్రహ్మ గంభీరక
ల్పనలేలు చియ్యుబట్టిన తెనుంగు
జీర్ణంచుకొంటిని శ్రీనాథుఁడందించు
సీసాలకొలఁది కావ్యాసవమ్ము
ఆఁకలించితిని పెద్దన్నాది కవిదిగ్గ
జములయబ్బురపుఁ గబ్బములకులుకు

సాహితీ విశ్వవిప్లవ స్రష్టలైన
నవయుగ కవీశ్వరుల ప్రబంధాంతరముల
మును పెఱుంగని యొక వింత చెఱుకుబెఱుకు
చూచి విజ్ఞానధనమింత నాఁచికొంటి.

తన జాతీయత కేవగించుకొని యంధప్రాయుఁడై యన్యవే
వన సంస్కారము కండ్లకద్దుకొని గప్పాల్ గొట్టు నిర్భాగ్యుఁ డీ
తెనుగుంబిడ్డఁడు స్వీయవాఙ్మయ సమాధింగట్టుకొన్నాడు మె
ల్చినవచ్చోట విదేశభాషలవి పొల్చెన్ జిల్వులుం బల్కులై.

మనవారల్ పడిచత్తు రాంగ్లమునకున్ మన్నింపరాంధ్రమ్ము చే
సినదేపాపము? వడ్స్వర్తులకు కీట్స్ షెల్లీలకుం బావవా
హనులై బ్రహ్మరథాలు పట్టెదరుగాదా? నేటికే నందగిం
చినవా? వీరికి స్వచ్ఛ దేశకవితాశ్చంగార సౌరభ్యముల్?

ఆయాభాషల నేర్వఁగూడదని నే నాశింపలే దీ స్వజా
తీయమ్మైన కళావికాసమున కేవేవంతరాయమ్ములో
ఆయా సంస్కృతు లుద్ధరించుట యనర్హమ్మందుఁ! గార్మబ్బు లె
ట్లో యాకాశముఁజుట్టి పై నెసరువెట్టున్ జంద్రికాకాంతికిఁ.

తెలుఁగన్నన్ జెవికోసికొందును రసోద్రేకమ్ముమై నీ మహో
జ్జ్వల భావమ్ము శమించిపోయినది నాసఁసారముంబాడుఁ, గా
వలె నింగ్లీషు ప్రవేశమెంతటి కళాపాండిత్య మింపారినన్
గలదే భుక్తి? తపస్సుచేయవలె యోగ్యమ్మైన డిగ్రీలకై.

హిందీ తెల్గులు కూడుఁబెట్టవని నా కింగ్లీషు నేర్పింపనై
చందాలెత్తి పరిశ్రమించి బహు కష్టప్రాప్తికిం బాత్రమై
అందించుం బయికమ్ము నక్కఱకు నా యౌన్నత్యమే తల్లి కా
నందంబింతకు నేను జీవనముకన్నన్ దీయ మా యాత్మకున్.

అవధానమ్ము సడల్పఁబోక తలక్రిందై చేతికిఁజిక్కు నే
యవకాశమ్మును జాఱనీక పఠనావ్యాయామముల్ సేసితిన్
కవితాతత్పరతోడ మెట్రికు పరీక్షాపత్రముల్ వ్రాసి నా
యవిరామశ్రమ మిప్పు డుండుకొను నా, నాయోగ్యతాపత్రమున్.

కొన్నాళ్ళకు హృద్రోగము
నన్నలమెను గుండెలాగినట్లైనవి నా
కన్నమ్మకు జబ్బుకుదర
దన్నారు స్వలాభ లంపటాత్ములు వైద్యుల్.

లంచములుగొను స్వార్థలాలసులెగాని
యనదల మొగమ్ముఁజూచు ధర్మాభిరతులు
గారు "డాక్టర్లు" పరహితకారి గాన
బడును నూటికి కోటికెక్కడనో యొకఁడు!

పాషాణమొ! యౌషధమో!
యీషన్మాత్రంబు గుణము నిచ్చినఁజాలున్
దోషము లే దౌషధమే
పాషాణమ్మగును నేటి వైద్యునిచేతన్.

ఇల్లమ్మి కొంత పైకముఁ
జెల్లించియు నూడిగమ్ముఁజేసియుఁ గరుణా
పల్లవితమూర్తియగు నా
తల్లి ననుంజూపె నొక్క ధన్వంతరికిన్.

నారోగమ్ము పరీక్షఁజేసికొని ప్రాణాధారమౌ నాడిలో
నీరక్తస్థితియేరుపడ్డదని నందేహించె నావైద్యుఁడీ
నైరాశ్యమ్ము శమించునంత రుధిరన్యాసమ్ముగావించుచో
ఘోరవ్యాధి నివృత్తియౌనఁట! యనుంగుందల్లి కన్నీరిడెన్.

ఒకనికొఱకు రక్తమొలికించు నెవ్వఁడు
ఎఱిఁగి యింత త్యాగమెవఁడు సేయు?
భాగ్యమున్న వచ్చి పడిగాపులొనరించు
లోకమునకు దృష్టిలోపమిచట.

దీనముగ, మౌనముగ మాతృదేవివంక
శిథిలమూర్తిని నేను సూచితినొ! లేదొ!
కరుణామయములు నా కటాక్షమ్ములొరసి
తల్లికడుపున నగ్నిహోత్రములుమండె,

ఆ యమృతద్యుతుల్ దొణఁకులాడిన నా వరహాలతండ్రి మో
మా యిది? యెంతలోన సుకుమార తనూలత వాడివత్తయై
పోయిన? దెన్నిపుట్లవగపుంబరు వీ నిరుపేదగుండెపై
వేయునొ! చూచెదన్ విధికి వేసటపుట్టకపోనె యింతకున్?

మలిగిపోరాదు నాకులగోత్ర విఖ్యాతి
దిద్దితీర్చెడు దివ్యదీపకళిక
వ్రాలిపోరాదు నాబ్రతుకుఁ బూఁదోఁటలోఁ
దలయెత్తుకొన్న రత్నాలపంట

ఒరగిపోరాదు నాచిరతపఃఫలములు
కలసి రూపొందు బంగారుకొండ
చెదరిపోరాదు నాహృదయనాడీతంత్రి
దొరలించుకొన్న సంతోషగీతి

ఆగిపోరాదు మృత్యు ఝంఝానిలమున
కొట్టుకొనుచున్న నా చిన్నిగుండెకాయ
బ్రతుకవలె కన్నకొడుకు శాశ్వతముగాగ
గుదులుకొనిచత్తు! ప్రాణమ్ము గ్రుమ్మరింతు!

ఇదిగో! రక్తము, దేహ
మ్మిదిగో! ననుఁజీల్చిచంపుడీ నాబిడ్డన్
బ్రదికింపుఁడనుచు వైద్యుని
పదాలపైఁ బ్రాలి తల్లి బావురుమనియెన్.

తల్లిదేహమునుండి రక్తములుపిండి
నాశిథిలనాళముల నింపినాఁడతండు
నేను చైతన్యమూర్తినైనాను జనని
నేలఁ బ్రాలిన దావజీవాలు క్రుంగి!

ఆలోచించిన గుండెఝల్లుమను నేఁ డామాతృజీవాణువుల్
నాలోనున్నవి నేటికిట్లిచట నున్నానన్నచో నామె ప్రే
మాలోకమ్ము ప్రధానహేతు వొక హేయమ్మైన సంతృప్తికై
పాలంబెంచిన త్రాచుఁబాముపనికిం బాహుల్ ప్రసారింతునే?

బ్రతుకుటెడారిరేగిన తుఫానుక్రమమ్మునఁ దేలిపో నప
స్మృతి విదళీకృతాంగముల జీవకళల్ వికసించి శాంతిదే
వతవలె మేలుకొన్నది కృపామయి. వైద్యునకంజలించి చే
రితిమి గృహాంగణమ్మున కదృష్టముతోఁ జెలగాటమాడుచున్.

నాలుగువత్సరాల్ గడచె నా జనయిత్రి యనుజ్ఞపై కళా
శాలనుజేరి నేఁ జదువసాగితి నెప్పటియట్లు. కూటికిన్
గూలికిఁగాని యీచదువు గొప్పదనమ్మునకై యమూల్యమౌ
కాలము ఖర్చుపెట్టితిని కన్నులవిప్పితి నాఁడునాఁటికిన్.

అవి ప్రతిభారతీయ హృదయమ్ము స్వతంత్రత కళ్ళుఁజూచు వి
ప్లవ సుముహూర్తముల్, భరతరాజ్ఞి ముఖమ్మున రక్తకుంకుమ
చ్ఛవి గయిసేసికొన్న యుగసంధ్యలవే! యవి తెల్లవాని ప్రా
భవము పునాదిఱాల్ కదలబాఱిన పౌరుషవన్నిమేషముల్.

గంగోత్తుంగ ఘుమంఘుమార్భటి తరంగంబోని స్వేచ్ఛామహా
సంగీతమ్మున మాఱుమ్రోగినది యాశాగోళ మంగాంగము
ప్పొంగన్ గట్టలు త్రెంచుకొన్నది ప్రజాంభోరాశి యొక్కుమ్మడిన్
శృంగమ్ముల్ విఱుగంబడెన్ మదవదాంగ్లేయాగ్రసామ్రాజ్యమున్.

బంగారమ్ములు పచ్చగిల్లిన ధరాభాగమ్ములం దక్కటా
యంగారమ్ములు తెచ్చిచల్లిన కఠోరాత్ముల్ ప్రజారక్తపుం
భంగిత్రాగి ప్రమత్తులైన దొరలా స్వాతంత్ర్యశంఖధ్వనిన్
కంగారెత్తిరి సాగిరావు నడుమంత్రంపుం బటాటోపముల్.

గడచెన్ గొన్నిశతాబ్దు లీ దొరలకుం గాళ్ళొత్తి దుర్జాతికిన్
గొడుగుల్ పట్టి ప్రపూజ్యభారతము కన్నుల్ విప్పనేవిప్పె, ప
చ్చడియయ్యెం బరతంత్రతానిగళముల్ సత్యాగ్రహారంభియై
నడిపించెన్ గుజరాతుకోమటి యనంతస్వీయసేనావళుల్.

గాంధీజీ యధినాయకత్వమునఁ గాకల్ దీరి యొక్కొక్కరుం
గాంధీలై శివమూర్తు లుగ్రనరసింహస్వాములై సింహముల్
గంధేభమ్ము పయింబయిం దుముకులీలన్ శత్రు సమ్రాట్పిర
స్పంధుల్ జాఁ బరాక్రమించిరి "ఉహోజావో" నినాదాలతో.

బాంబుల్ ప్రేలె తుపాకి గుండ్లుఱిమె తెప్పల్ దేరె రక్తప్రవా
హంబుల్, క్రుంగిన వెఱ్ఱిబుఱ్ఱ తలకాయల్ నిండె కారానివా
సంబుల్ మృత్యువు నప్పుచున్నను స్వరాజ్యప్రాప్తికై ముందు దూ
కెంబో! విప్లవ వీరభారతము మూకీభూతరాజ్యాంగమై.

నేనుఁ నాడొక శాంతిసైనికుఁడనై నిద్రాసుఖత్యాగినై
ప్రాణాయామమొనర్చినాఁడను ప్రజాస్వాతంత్ర్య సంసిద్ధికై
జానో! కాదొ! ఫలానుభోగ మొక కార్యమ్మైన సాధింపకే
మేనుల్ మోయుటకంటెఁ బీన్గులయినన్ మేలేసుమీ మానవుల్!

బేడాడబ్బులకోసమై పరులతో బేరమ్ము సాగించి నా
వాఁడేవీఁడను సోదరత్వముఁ దలంపంబోని స్వార్థాశయుల్
గూడల్ క్రుంగి గులాములైన ఖటముఖ్యుల్ నాఁడుమాయింటిపై
దాడీచేసి వృథాపవాదములు ప్రస్తావించిరేవేవియో!

చుట్టుంగాముట్టిరి మ మ్మమాంతము కృపాశూన్యాత్ములై యింటిలో
గుట్టుంగా లోకుల కప్పజెప్పెడి కృతఘ్నుల్ తెల్లవాబందు లు
న్నట్టే ప్రేల్చెం దుపాకి నందొకండునన్ రక్షించు నుద్రేకముల్
పట్టంజాలక తల్లి వ్రేటువడి నేలంగ్రాలె నాకడ్డమై.

ఇది ప్రాపంచిక చిత్రయేయనుము దేవీ ! జీవితమ్మందు నా
పదపై నాపదగల్గు- భాగ్యముపయిన్ భాగ్యమ్ము సంధిల్లు నా
హృదయారాధ్య పవిత్రదైవతము మాతృశ్రీ స్మృతిచ్ఛాయలం
దొదుగం జీంకటి బంధిఖానంబడి నే నున్నాడం గొన్నాళ్ళుగా.

అమృతమ్ముల్ చిలికించునే పెదవితో నాతల్లి యాశీర్వచ
స్సుమవృష్టిన్ గురియించునో తెలియ దేక్షోభమ్ములేకుండగా
తమసీగేహము వాసి నాజననిచెంతంగ జేరితింగ జిక్కి శ
ల్యమువోలెన్ గొనయూపిరుల్ కనులలో నల్లాడు దీనస్థితిన్.

ఏరా ! కన్నులవెన్నెలా ! కుశలమే ? యెన్నాళ్ళ కెన్నాళ్ళ కీ
దారుల్ త్రొక్కితివన్న ! నాకడుపులో దావాగ్ని ముట్టించుచుంగ
గారావాసమొనర్చి యిప్పటికినైనన్ బ్రాణసంధాతవై
చేరన్వచ్చితి వంతెచాలు నింక నే జీవింతు నూరేండ్లుగా.

పుడిసెండూపిరి మేననుండువఱకేమో ! నాయనా ! నేను నీ
కెడమై శోకభరమ్ము మోసికొనలే నీ శుష్కహస్తాలతోం
గొడుకున్ గన్నులనిండజూతునను నాకూతమ్ము నావేశమే
నడిపించెన్ నను, నీకుగా నిలిపితిన్ నాజీవసర్వస్వమున్,

నీ దీర్ఘాయు రనామయోన్నతికిఁ దండ్రీ! మ్రొక్కుకొన్నానురా!
వే దేవుళ్ళకు కట్టితిన్ ముడుపు దేవీసాక్షిగా. శ్రీగిరి
ప్రాదుర్భూత మహేశ్వరార్థమిఁక నా వాంఛించు వైభోగమే
లే దా కొంచెముఁజూచి యీ బ్రతుకుఁజాలింతున్ బ్రశాంతమ్ముగా.

అని వాత్సల్యముపొంగులెత్తు నెదతో నానందబాష్పాలతో
నను ముద్దాడిన దమ్మ భక్తిగిలిగింతల్ సేయ దేవత్వమే
తనువుందాల్చిన తల్లిపాదములచెంతన్ బిల్లబీటైతి సం
తనె చెల్లాచెదరైన వీ హృదయచింతల్ తత్కరస్పర్శలో!

విన్నావా? యిది ప్రేయసీ! కరుణమావేశించు నీదృశ్యముల్
గన్నావా? యెటనేని, జీవితము నాకై యాహుతింజేయు నా
కన్నమ్మన్ మదియందుఁ జూచుకొని నీ కాఠిన్యముల్ మార్చుకో
నున్నావా? హృదయమ్ము నూపునవి కావో యీ కథాఘట్టముల్?

తనదీపమ్మని ముద్దుఁబెట్టుకొనినంతన్ మూతియున్ ముక్కుగా
లిన యున్మాదికిఁ దోడుబోయి ప్రియురాలేగా! ప్రమాదమ్ములే
దని యామాత్రము నోరుజాఱితిని నాప్రాణమ్ముతోఁ బోక త
ల్లినిసైతమ్మెటు గావుబట్టెదు కరాళీభూత కాళీక్రియన్?

నీకున్ నా కనుబంధమంత కలదేనిన్ గృష్ణలోదూకి గం
గాకల్లోలములందుఁ దేలుదమురా! కాకున్నఁ దూనీగలా
టా? కలతాంతర ఖండనోద్యమము ప్రేమామ్నాయ విద్యార్థిచే
నూకొట్టింతువె పచ్చిబూతు, నిను నమ్మారూరు చీకొట్టగన్?

ఇది యెచటికోర్కె ? యొక జీవమెదురువెట్టి
ప్రేమఁ గొనితెచ్చుకొను కర్మమేమినాకు ?
నిలుపుమిఁకఁ దల్లి కుత్తుక నులుముకతలు
భూతబేతాళములు నవ్విపోవునేమొ !

ఆడినమాటతప్పుట యొకప్పుడు పాపముగాదు నాకడన్
బాడిగ పుచ్చుకోదుగద భాగవతమ్మది చాటఁ దల్లికిం
గీడుఁదలంచి తెచ్చుకొను కీర్తిధనమ్మునకంటె సత్యపుం
గాడినిదప్పి నింద లొడిగట్టెడు భాగ్యత కంజలించెదన్.

రాక్షసికమైన నీ మనోరథముదీర్ప
పాతుకొనిలేదు నాలోన జాతిగుండె
ఆర్ద్రహృదయముగలదు ప్రేమాక్షరములె
దిద్దుకొందు ! నిన్ గన్నుల కద్దుకొందు !

సుమదేవి :—

ఔననుకొన్న యంతపనియైనది నిశ్చల నిర్మలాను రా
గాను గతాత్ములే తగుదు రట్టి యసాధ్యము నార్పదీఁర్ప నే
వో నయగారముల్ పలికిబొంకుటయా ? ప్రియురాలికిచ్చు నీ
కానుక ! కార్యఖడ్గములెకా మగవానికి నిండుమీసముల్ ?
అన్నది నీవె ? కోరుకొనుమా ! యని కోరినమీఁద కాదు లే
దన్నది నీవె ! యేమిటికయా ! బలవంతపు బ్రాహ్మణార్థ మ
ట్లున్నది నేఁటి నీ ప్రణయ మొప్పదునాహృదయమ్ము సత్యవా
గ్భిన్నత ; నిమ్ము నేను నడిపింపకతప్పదు కోర్కెమేరకున్!

ప్రణయరసరాజధాని కీ పడుచుదాని
కగ్రతాంబూలమిత్తువో! అమ్మ పాద
సేవనే మెత్తువో! సమీక్షించుకొనుము
కుదురదిఁకమీఁద ముసుగులో గ్రుద్దులాట!

ఇప్పటికి నిష్క్రమించెద మెన్నఁడేని
నేను తలఁపునసోకిన నీ ప్రతిజ్ఞ
నా యపూర్వవరమ్ము వెంటనె స్ఫురించుఁ
గాక! మన ప్రేమగాథ సుఖాంతమగుత!

అని సుమమ్ము పలికె నలిబాబు పల్లెత్తి
బదులుపలుకఁ డిరువు రదిరిపడిరి!
పూలుగురిసెనతఁడు బాలు రుష్టినదామె
ఎవరు బాధపడిరొ! యింతకచట?

మసక మసకగ చేటంత మబ్బుపట్టి
యల్లనల్లన నాకాశమంతయైన
దంతగా మిట్టిపడిన చంద్రాంశుపటలి
ఆపసోపాలు పడిపోయె నర్ధరాత్రి.

అవ్వనము ప్రక్కనున్న హర్మ్యములపైపు
నడచి రిరువురు కలికి గాంధర్వవేళ
ఇరుల మెఱసెడి మిణుఁగురుఁ బురుగుగూడ
నతని జడిపించెఁ గొఱవిదయ్యంబువోలె!

నటదీశాన విశాలఫాల నయనాంతజ్వాలికా శూలికా
చ్ఛటకుంబోలికయై స్వనాథుని మనస్సామర్థ్యమున్ బైట వే
యుట కేమో ! తెగరుంజుకొన్నయవి విద్యుద్వల్లికాకాంత ల
న్నటు కంటందడివెట్టె మేఘుఁడు నిరంతాసారధారామిషన్.



# మధుమాస శుక్లపక్షము

కాలము వ్రాయు మాసమను గ్రంథమునన్ నడచెం బదేను పే
జీలవి గాథగాథ తమసీవచనా పరమావధుల్ కళో
ద్వేలము శుక్లపక్షమను వేఱొక ఘట్టము వ్రాయఁబూని కాఁ
బోలును వెండిపోఁతకలమున్ గదిపెన్ నెలరేకరూపునన్.

నీలపురంగుదారముల నేసిన చీఁకటి బుస్గుఁగోక లి
న్నాళులు కట్టి మోజుడిగినట్టి నిశా చపలాక్షి యూదినన్
గాలికిలేచు నుల్లిపొరకన్నను సన్నని ధౌతవస్త్రముల్
దాలిచెనన్నరీతి దెసలన్ దళుకొత్తెను గ్రొత్తవెన్నెలల్.

నిప్పయి మండుభాస్కరుఁడు నే ననినన్ పగలూని, ధర్మమున్
దప్పి సయాము తమ్ములగు తమ్ములనే యటు ముంచెరాజు నా
కిప్పుడు దిక్కు స్త్రీల యని యేచెలి ఱెప్పలమీఁదనో! మఱే
కొప్పులలోననో! కుదురుకొన్నది చీఁకటి కాటుకంబలెన్.

రేఁగిన యంధకార కబరీభరముం దరుదారఁ దారకా
నైగనిగప్రభల్ చెరిపి నల్లని నవ్వులరేపడంతి యూ
రేగిన దిన్నినాళ్ళవని నే వలపించెనె? చందమామ నా
కౌఁగిఁటఁజిక్కి సొక్కెననఁగా సలరెన్ దెలిరే యొయారముల్.

వేఁడివెలుంగు రేఁడు జలివెల్లువఁదనంబున రాజ్యమేలఁగా
నీడలజాడలే నిలువ నీడలుగాఁ జటులాంధకారముల్
పోడిమిమాలి దాఁగుకొనిపోయిన వక్కట! తామసక్రియా
క్రీడుల కియ్యధఃపతన ఖేద మదెన్నటికేనిఁ దప్పునే?

తెలినిగ్గుల్ సవరించి వారిధరపంక్తిన్ మల్లికాపుష్ప శ
య్యలుగా మార్చు శశాంకసుందరుని సయ్యాటమ్ముకై యప్సరో
లలనల్ చక్కనిచుక్కలై నిలుచు లీలన్గాని యీవన్నె చి
న్నెలు రాఁబోవునె? నీలినింగి నన మించెన్ జంద్రికాశర్వరుల్.

గిఱిగీతంబలెఁ జిమ్మచీఁకటితెరన్ గీలించి యన్యోన్య బం
ధుర బాహాపరిరంభభోగములకున్ ద్రోహంబుఁ గల్పించు ము
ష్కరపుం గృష్ణనిశీథినుల్ సనియె నింకడ్డంకి యే ముగ్ధరా
వరసీమంతిని యానిశాంతము శశిన్ బండించుకోదే రుచిన్?

చందనసారశైత్యములు జాల్కొను వెన్నెలలోఁ గుముద్వతీ
సుందరి రేవెలుంగుఁ బడుచుందొరసానితనంబుఁజూపగా
కందిన కన్నెతామర మొగంబునఁదోచు విషాదరేఖలో
నం దలదాచుకొన్నవియొ! నా నగుపించ విరుల్ మఱెచ్చటన్!

పండువయ్యెఁ జకోరదంపతుల పాల
పాల వెన్నెల యదియ కాకోలమగుచు
మొగముఁజిట్లించె జక్కవ పులుఁగుజంట
పుఱియకొక బుద్ధి, జిమ్మకొక్క రుచి గాదె?

వేలుపురాచకన్నెలెలవెన్నెలచిన్నెలలో రహస్య రా
గాలపనం బొనర్చెదరుగావలెఁ! బైకొను స్వప్నమాధురిన్
సోలెఁ జరాచరప్రకృతి చుక్క వెలుంగయిసన్ విదల్ప వా
నీలి నిశల్ పనే మవి ధ్వనించు నపశ్రుతు లిందు మాకసన్!

వికచాంభోజ సఖంబులౌ ముఖములన్ వేధించునో! చక్రబా
ధకుఁ డాగుబ్బ చనుంగవన్గలచునో! తానంచుఁ జంద్రార్తిమై
ప్రకృతంబుల్ జలతారు మేల్ముసుఁగులొప్పన్ దీర్చి జ్యోత్స్నాభిసా
రిక లూరేగు విలాసముల్ పెనుచు నీరేలన్ రసోద్రేకముల్!

అమృతపుజల్లువోలెఁ జలువై చెలువారెడు చంద్రికాప్రసా
రము, నవమాలతీ సుమ పరాగముతోడ సరాగమాడు మం
దమలయ వాయు చామరవితానము నింత యమర్చి శుక్లప
క్షము పథికాభిశాపములఁ గాంచెడు లోకముమెచ్చె నెవ్వనిన్?

మంచువెన్నెల నెండగాయించి విరహి
జనము వేధించుచున్నాఁడు చందమామ
మామకున్దగ్గ యల్లుఁడ మ్మదనుఁడింక
నలరు గుత్తులు చురకత్తులగుట యరుదె?

దినదినము శుక్లపక్షము
ఘనమయ్యెడు కొలఁదిఁ దనకుఁ గామము ప్రియపైఁ
బెనుపగుచు జననిమీఁది కృ
ప నశింపఁదొడంగెఁ గృష్ణపక్షము కరణిన్!

చైత్రంబుండుకొలంది గౌరవ కృపా సంతోషముల్ హెచ్చుచుఙ్
ధాత్రీలక్ష్మిరసమ్ములఙ్ దనుప జ్యోత్స్నాశోభలన్ గుప్పి చా
రిత్రార్థత్వము గూర్చుచుండె గగనశ్రీ కష్టముల్ లేము లే
మాత్రంబుఙ్ గనుపట్టునే స్వజన సన్మానంబుఁగావించుచో ?

రజతాద్రిఙ్ మధుమాసవేళలఁ గరీంద్రక్రీడలఙ్జూపి ద
క్షజ నా భూతపతిన్ దదాకృతులతోఁ గామింపఁగాఁజేసి సా
మజవక్త్రుం బ్రభవింపఁజేసిన మహామాయాపరుండైన భా
వజుఁ డెవ్వారల, నేమి సేయఁడిఁక నెవ్వారేమిఁగాకుండెడిఙ్ ?

జిలిబిలిగా నెలవెన్నెల !
చలిచలిగాఁ గాలి తరఁగ సయ్యాటలు! కో
వెలలో కోయిలగిలి ! యీ
యలజడిలో గుండె గుదిలి యలిఖాబడలెన్.

అండకురాని యే పడఁతి యందమునో యెరవైచి నిర్దయన్
గుండెలు గుండెలే పగిలి నూకలు నూకలుఁగాగ నూరకే
చెండకురోరి మార ! చెయిజిక్కనెచిక్కె నటంచు పుష్పకో
దండధరుండవై మిసిమితామరదాయకుఁ దోడువచ్చుచున్.

అతనుఁడ వౌటచేత విలునమ్ములు పుష్పములౌటచేత గా
డ్పు తురఁగమౌటచేత, బలముల్ పికకీరములౌటచేతఁ బెఙ్
వెతపడుచుండెగాని యిఁక నీ కసలన్నియు నన్నిరీతులన్
జతపడియున్నచో బ్రతుకఁజాలునె ? యిజ్జగముల్ రతీశ్వరా !

ఒకపరి వెండికొండదరి నుగ్రతపస్సుననున్న స్థాణునే
తికమకలంబొనర్చితివి ధీరతలేని మనుష్యమాత్రులన్
వికలులఁ జేయుటెంతపని నీకు ? నహో ! గుడిమ్రింగగల్గువా
రికి గుడిలోని లింగమును మ్రింగుట భారమటోయి మారుఁడా !

జనకుఁడు లోకరక్షకుఁడు సంతత సౌఖ్య పరంపరాప్రదా
యిని జనయిత్రియౌఁగద ! యిసీ ! యిదియేమి ? పవిత్రతల్ గుబుఁ
కొను తులసీవనిన్ దురదగొండితనమ్మెటువచ్చె నీకు ? పాం
థ నిచయమేచుటేన ? సరదా వలదా ? దయ సుంత మన్మథా !

పలికి బొంకి చెలినిబాయ రెండందాల
నరకబాధగలదు నా కిదేల ?
అన్నమాట నిలుపుకొన్నచోఁ బ్రేయసీ
సన్నిధానమునను స్వర్గమమరు !

ధీరోదాత్తుఁడు సత్యము
దారిఁ దొలఁగడెన్నఁ డాడితప్పిన వాఁడి
ద్ధారణి పటించు నిందల
బారింబడి, చచ్చి రౌరవమున పటించుఁగా.

ఇండన్నన్ సరె ! యిత్తు పొమ్మనినపోదే ? పట్టి పల్లార్చు బ్ర
హ్మాండంబా ? యొక చిన్నిపిట్ట యది తా నన్నంత నెగ్గించుకోఁ
గండల్ కండలు కోసియిచ్చి పరువున్ గాపాడుకొన్నాడు ధీ
రుండై యా శిబివల్లభుం డతని తీరుల్ జాతి కాదర్శముల్ !

వచ్చినవాఁడబద్ధ వటు వామనుఁ డాతని కిచ్చుటన్న చోఁ
జచ్చుట, తానెఱుంగునది, జాతిని దిద్దిన పెద్ద, యొజ్జయై
హెచ్చరికించె నైన వినెనే? చనెనే పెడదారి? ప్రాణమే
నిచ్చెన కాని బొంకఁడు బలీంద్రుఁడు తత్కృతి కంజలించెదన్!

బొంకఁగ వచ్చు నఘంబు పొందదని యేవో గండముల్ సెప్పి ని
శ్శంకన్ నీ వవకాశవాదివగుచున్ స్వార్థప్రియుల్ పొంగ నీ
వంకఁ జట్టుమువెట్టినా వయిన నీవాఁడే నిమన్ నమ్మలే
దింకన్ లోకము లొఁగివచ్చుననుకొంటే శుక్ర! నీ నీతికిన్?

ఒడ్డాణిల్లు సముద్రసప్తకముతో నొప్పారు బంగారపుం
గడ్డఁ జోగికిఁ ద్యాగమిచ్చె నదియే గాకమ్ముడై పోయి రాల్
బిడ్డల్ తాఁ దుది బానిసీడయినఁ బాలించెఙన్ హరిశ్చంద్ర రా
జుడ్డీనాశయుఁడై నిజోక్తి, సురవంద్యుల్ గారె? యేతాదృశుల్.

అడుగో! నిన్గికురింప నింద్రుఁడు కుమారా! యాఘుమేఘాలపైఁ
బడి వచ్చెన్జుమి!" యంచుఁ దండ్రి తెలిపెన్ బైవచ్చు కీడైన జం
కడు; సత్యప్రియదాత కర్ణుఁ డల స్వర్గాధ్యక్షుఁ డర్థించుటే
తడవిచ్చెన్ గవచంబుఁ గుండలములేతన్మార్గముల్ భవ్యముల్!

నిను రారాజునొనర్తు సర్వసుఖముల్ నీ కైవసంబౌను నా
కనుసన్నన్ జనుమంచు వెంటఁబడి రక్షశ్శక్తి కల్పించు శో
ధనలన్ నెగ్గుచు నిగ్గుదేఱి తుది సత్యస్థాపనాదీక్ష శి
ల్వను రక్తమ్మొలికించు క్రీస్తు కనుత్రోవల్ నాకు మేల్బంతులౌ!

భగవద్గీత మథించి తత్త్వసుధ నాస్వాదించి విన్నాణపుం
జిగిమై పండిన విశ్వమోహనుఁడు గాంధీ వీరరాజర్షి చిర్
నగవుం బాయకతీర్చె జీవిత మహాప్రస్థాన మెద్దాన నా
సుగుణబ్రహ్మము సత్య తేజమునకున్ జోహారుగావించెదన్ !

జనని వధించినాఁడనని సత్యపరాఙ్ముఖమైన లోక మీ
నను శపియించు నైనను మనఃపరిధిన్ దిరుగాడు నేసనా
తనమగు విశ్వశక్తియొ ! యదల్చెడు నన్ మునుముందు కింత తీ
అని దిగులేల ? య ప్పరశురామునకైనది నాకునయ్యెడున్ !

ఆపనిఁక నికర ! మోపని
యీపని శ్రీశైలమునఁ ముగింతును పాపం
బో ! పుణ్యమొ ! క్షేత్రంబది
అపై వాఁడొకఁడు సూచు నంతయుగాచున్.

అని యొక్కెత్తున నిశ్చయించుకొని యా యాలోచనంబే సులో
చనమై తోచనిదారిసైతమును విస్పష్టంబుగాఁ జూపగా
మును వెన్కల్ పరికింప కంగన గృహంబున్జేరె నక్కామి యే
మనుకొన్నారొ ! మఱేమొ ! మింట గురకొయ్యల్ గ్రుంకె నొయ్యొయ్యః

నందనుండు శ్రీశైల మన్నాడొ ! లేదొ !
హర్షమమ పుట్టెడాసం బ్రయాణమయ్యె
నమల తీర్థంబు లనినఁ బుణ్యస్థలు లన
నాంధ్ర వృద్ధుల కెందుకో యంత యాశ?

వారు మువ్వురు టూరిస్ట్ బయలుదేరి
ముందు సీటునందు నలిబాబును సుమమ్మ
వెనుక సీటునం దొక్కట హర్షమున్ను
యధివసించిరి శ్రీశైల మరుగఁ దలఁచి.

అయ్యరు హోటల్ను తియ్యతియ్యగ పెద
జల్లుచున్నవి డికాక్షనుల సౌరు
ఐదు గంటల మేలు పై దూకుచున్నవి
రైలుస్టేషనుకు గుఱ్ఱాలబండ్లు
క్లీనర్లు దుమ్ముదులిపి బస్సులకు బొగ్గు
వేయుచున్నా రేమొ పోయినట్లు
చనుచునుండిరి రాత్రి సినిమాకువచ్చి య
చ్చటచటఁ బడుకొన్న జానపదులు

ప్రొద్దు పసిబాబు నిదురమంపుననెయుండి
ప్రాకుచున్నాఁడు పూర్వ పర్వతముపైకి
విశ్వ వైతాళికతఁ బూను విహగనాద
మధురిమశ్రీకిఁ గెంపులు మలచుకొనుచు.

గంటకే నూఱుమైళ్ళ వేగంబొ పెట్టి
వడివడిగ కారు నలిబాబు నడపుచుండె
ప్రక్కన సుమమ్మ పాశ్చాత్య భాషలోన
చిన్నచిన్నగ నేమేమొ చెప్పుచుండ!

దుమ్ము లెగయఁ బెల్లురవడితోడఁ గారు
బుయ్యి మని మ్రోతలిడుకొంచుఁ బోవుచుండె
నిప్పుఁబెట్టి రెట్టకొలఁది నేలబారు
గ వెడలవిడిచిన యవాయిచువకవోలె !

సుమము బాబునకే మహార్ధము నిమిడ్చి
పలుకుచున్నదో కీసుబీసులు ధ్వనింప
అతఁ డొకపరి నవ్వు "యస్ యస్స"టంచు
నొసలు విఱుచునొకపరి "నో నో" యటంచు.

వారు కావించు నాఁగ్ల సంభాషణంబు
అందగించదు సుంతైన హర్షమునకు
భావ కవులకు ఛందః ప్రబద్ధమైన
నారికేళపాక ప్రబంధంబు కరణి.

నట్టనడిప్రొద్దుకు దిగువమెట్టఁ జేరి
కొంతసేపట సుంత విశ్రాంతినంది
అచటనుండి కాననమార్గ మనుసరించి
నడుపసాగెఁ గారును హడావిడిగ బాబు.

చెడు కవి కలమున నడచెడు
వడిదుడుకుల ఛందమట్లు వనమార్గమునం
బడి కారూర కెగిరెగిరి
పడుచుం బఱతెంచుచుండె వడిగా దడగా !

ప్రొద్దువాల్దలకుఁ దూరుపువైపు మరలిన
చెట్లనీడల తివాసీలు పఱచి
ఉభయపార్శ్వముల నేపొంది ముందుకుసాగు
చివురుఁగొమ్మల నునుఁజేతులూపి
మంచుంజలువ యాకుమదుగులో మృదువుగా
నెలిఁగించు పులుఁగు గొంతెత్తిపిలిచి
దారులఁ బూలగంధముచల్లి కైసేయు
కట్టుగాడ్పుల యెదుర్కొలు లొసఁగి

భేదభావములేక యా విపినలక్ష్మి
యెల్లరకు నాతిథేయ సత్కృతులొనర్చె
ప్రకృతి నరజాతిపోలె నెప్పటికిఁగూడ
పిలుఁదులఁబెట్టి పిటలు వేయఁబోదు!

ఝుమ్ముమ్ముఁ దుమ్మెద తొలుపుల కచ్చుటచట
బెజ్జములు వడ్డ వెదురులు పిల్లగాలి
కూహూ కెత్తుచున్నవి యూఁదకూఁగికొనుచు
నందగోపాలు వేణునినాదసుధను.

ఆ తపమ్మెంత శ్రమసేయు నారితేఱి
కవులు వెలయించు చక్కని కవితలట్లు
ఆ తపమ్మెంత శ్రమసేయ నారితేఱి
పూఁబొదలు గుప్పుచున్నవామోదమచట.

జ్ఞానధనులైన మనుజులకేని లేని
యచ్చపు స్వతంత్రజీవిత మవఘళింప
జతలు జతలుగ వాంఛిత స్థలులనిలిచి
హాయిగాఁ గూయుచున్నవి యండజములు.

ఎగుమోరల్ దిగుమోర లారయకయే యేతెంచియేతెంచి య
న్నగమున్ జేరుట కమ్మునేసిన విధానంబొప్పి ప్రాక్పశ్చిమం
బుగఁ గన్పట్టెడు కాలిత్రోవకడ ముప్వుర్ క్రిందికిన్ డిగ్గినా
రు గిరీశుఁ దరిసించిరానవలఁ గార్వొ వీలుగాకుండినన్.

పోవుచునుండుమమ్మ! యెటువోక భయంపడకుండ చక్కనీ
త్రోవనె, కారు నా యెదురుత్రోవకడఁ బదిలంబుజేసి నీ
తో వడి జేరవచ్చెదము దూరమెయౌను గిరీశుఁజూచి నే
డేవలనైన పోవలయు నింటికిఁ దొమ్మిదిఁగొట్టులోపునన్.

అనుచు హర్షమాంబ నా త్రోవనేబడి
చనుచునుండుమంచు సాగనంపి
ఆత్మజుండును సుమ మచట నేమో! తల
పోసికొనుచు నిలిచిపోయినారు.

ఎవరు లేమిఁజేసి యింతి బాబు నరసి
ఉండు ప్రొద్ద? పోవుచుండు ప్రొద్ద?
అలసింతువేల? తేలుచుకొనుమేదొ!
ధరణిఁబడ్డపాలు తిరిగిరావు.

నీడు తల్లినేని లేదేని నన్నేని
ననుసరింపవలయు నంతెకాని
బిడ్డమీఁదఁ బ్రీతి బెల్లంబుపైఁబ్రీతి
యుండుటెంకఁ బొసఁగబోయి ప్రియుఁడ!

ఏపూలం బ్రణయార్చఁజేసెదవొ! నన్నేపాటి మన్నింతువో!
పైపై నాటకమో! యథార్థహృదయ ప్రారంభమో! చూతుఁగా!
చూపంగావలెగా! భవన్మృదు పచశ్శుద్ధిప్రభావమ్ము నీ
వ్యాపారమ్ములు నేఁడు తేలెదు వయస్యా! పోయిరమ్మావెసన్!

నీ వీ యగ్నిపరీక్ష నెగ్గితివ? యింకేమున్నదాపైన బా
బా! వేఱే వివరింపనేల? మన దాంపత్య ప్రసన్నత్వమున్
నీవే నేనయి నేనె నీవయి– ప్రశాంతిం బ్రేమసౌధమ్ములోఁ
బూవుండోలల నూగుకొంద మనిశంబున్ నిర్విచారంబుగన్.

అని సీసా నొకదానిఁదీసి యది మాయాద్రాక్షపానీయమో!
అనురాగామృతమో! మరందమొ! కషాయమ్మో! మతేసారమో!
తొణఁకుల్ వాఱెడు కెంపువన్నె ద్రవమేదో గ్లాసులోఁబోసి యా
తని కందించిన దామె యాత్రమున హస్తద్వంద్వమల్లాడఁగన్.

అది మహాజ్ఞానికిని బుద్ధి హానిఁదెచ్చు
బ్రాందియే! దాని నతఁడధరమునకెత్తి
ముక్కు మొగముఁ జిట్లించుచు నిక్కినిక్కి
యాగియాగి త్రావఁగలేక త్రాగినాఁడు.

నీవు వచ్చుదనుక నేనిచ్చటనెయుందు
పోయిరమ్ము ! ప్రొద్దుపోకముందె
పోయిరమ్మటన్న పోయివచ్చుటకాదు-
తలనుదెచ్చి చూపవలయునాకు !

సఖుఁడ ! మధుమాస కృష్ణపక్షంబు గడచి
పోయినది విషాద నిశీథముల వెలార్చి
తీర యిది శుక్లపక్షంబు దీనినైన
గడువనిమ్ము ! ప్రమదచంద్రికలు రహింప !

అనుచు నతని కామె జననిఁ జంపి శిరమ్ముఁ
దెచ్చి చూపఁ గత్తిఁదీసి యిచ్చె
అతఁ డామె యాన కనుమతిఁ జూపుచుఁ
గత్తిఁ జేతఁబట్టి కదలిపోయె !

పడుచువారలతోడఁ బయనింపలేకనో !
భయములేదను నభిప్రాయముననొ !
వెనుకవారే వత్తురను నమ్మకముననో !
యరుగలేనే యన్న యాత్రముననొ !
మునుముందుగా స్వామిఁగనిమ్రొక్కు దీక్షనో!
త్వరగ రావలెనన్న భావముననొ !
వనదృశ్యములఁజూచు పారవశ్యముననో !
యంతుపట్టని మతేధ్యానముననొ !

తిరిగిచూడక నిలువక వెఱపుఁగొనక
యేగుచున్నది యా యమాయికపుఁ దల్లి
పరువులెత్తి వచ్చెడి తన బాబుకన్న
మూఁడుమైళ్ళకు నెక్కుడై ముందు మిగిలి.

ఈ నరపుంగవుండకట ! యే పరమార్థము నందుకోసమో
కాననభూమిలో జనని కంధరమున్ విదళింపనుండె నా
ప్రాణము లోర్చుకోవు రుధిరంబునుగన్న యటన్న కైవడిన్
భానుఁడు క్రుంకినాఁ డపరవారిధిలోఁ దలదూర్చి కెంపునన్.

వాని పెనుగైపుఁ గన్నెఱ్ఱలోన నొదిగి
పోయిన విధానఁ గానరాదాయె సంధ్య
అతని కౌటిల్య మెఱిఁగిన యవియుఁబోలె
గుసగుసలు వోయె పక్షులు గూండ్లలోన !

భయపడనేల ? యొక్క ముదిప్రాణముఁదీయుటకో నరుండ ! యె
న్నియొ ! యఘముల్ నగమ్ము లవినీతులు కోఁతలు నాయెడందలో
లయమయిపోయె దీనికి విలంబనమా ? యని వానిచేఁతకున్
బ్రియమును బ్రోద్బలంబిడిన రీతిఁ దమస్సు రహించె నెల్లెడన్.

ఏగెడుకొలంది బడలిక హెచ్చుచుండి
యింతి యెడబాటున కిఁక సహింపలేక
మంపు తలకెక్కి కన్నులు కెంపువాఱి
కత్తిదూసె- వాదరఁజూచి- కరుణఁబాసి-

పోవుచుండెడి తల్లిని పోవునట్లె
అరెరె! వ్రేటుకే మెడఁ దెగనఱికినాఁడు
చెఱచెఱ న్నెత్తురుల నెగఁజిమ్ము కొనుచు
మొండె మొకపొంత! తల యొకపొంతఁ బడఁగ!

అతని కత్తిదెబ్బ రవళి కప్పుడచటి
జమ్మిచెట్టు చిట్టచిటారి కొమ్మమీఁదఁ
గునుకువోయెడి యొక పెనుగ్రుడ్లగూబ
యులికిపడి కూసినది "హమ్మహమ్మ" టంచు

గొజ్జియనట్లు తల్లి నతిఘోరముగా వధియించి యాదలన్
జుట్టునఁ జేతఁబట్టుకొని చానకుఁజూపి యశోమరందముల్
జుట్టుతలంపుతో దెసలఁ జూచుచు సొక్కుచు సోలుచున్ నిషా
బిట్టున వచ్చుచుండె నడవిం బెడమార్గముఁబట్టి యొంటిగన్.

అనుఁగుం దల్లిని జంపినావు మననేనా? యోరిదుర్మార్గ! నీ
తనువుంజీలిచి చెండిచెండి యిసుమంతల్ సేసినం బాపముం
డునె? యంచంబరదేవి కోపమునఁ బండుల్ నూరి పైఁబడ్డ భం
గి నమాంతంబుఱిమెం బయోదములు సంఘీభూతభూతాకృతిన్!

ఇది మిట్ట యది పల్ల మిది సమతలమన
నిసుమంత భేదమ్ము పొసఁగనీక
చేతనంబులకు నచేతనంబులకు నా
వంత వేఱిమి యగుపడఁగనీక

నలుపువన్నెకుఁ దక్కుఁగలవన్నెలకు నూది
మొనయంతవార పైకొనఁగనీక
కనులు దెఱచినందుకును మూసినందుకు
నలుసంత పొరపుఁ గన్పట్టనీక

భూ నభములకుఁ గాటుకఁ బులిమినట్లు
బారు నీలి గుడారమ్ము పైచినట్లు
ప్రతినిమేష భయానక రసవికార
మంధకారము గబళించె నఖిలజగతి!

అకస మూఁగవీచికొనుచాకడ నున్న మహీరుహమ్ములన్
గూకటి వ్రేళ్ళతోడఁ బడఁగూలుపగాఁ దొడఁగెన్ ప్రభంజనుం
డేకడ దాచి యుంచుకొనె నింతకుముందఱ నంతశక్తి? నౌఁ
బైకి రవంతయేనిఁ గనుపట్టఁగఁబోరు గభీరవర్తనుల్!

కన్నుపొడుచుకొన్నఁ గనరాని చీఁకటి
కడుగడ్డునకు బాటఁ దడవికొనుచు
ఎడపెడ విసరికొట్టెడి గాలియూపుల
కాడాడ గుట్టల కానుకొనుచు
మిఱుమిట్లుగొలిపెడి మెఱపుమెఱపునకు
బరబర తెన్నులఁ బన్నుకొనుచు
నుద్దండమగు నుఱుముఱుమునకోయి బా
బా! యంచు గుండెలు బాదుకొనుచు

తల్లి శిరముతోడఁ దన యైదుప్రాణముల్
పిడికిటఁగొని బిక్కుబిక్కుమనుచు
నంతుపంతులేని యా యడవింబడి
వ్యధలఁబడుచు నతఁడు వచ్చుచుండె.

తందరుచువచ్చు నాతం
డందందు సురిగిపడి వ్యధలందెడికొలఁదిన్
బ్రాందీకై పు దిగఁబడుచుఁ
గందోయికిఁ జచ్చినమ్మ కనఁబడదొడఁగెన్.

కొడుకా! భద్రమురా! నిశీథమున నీ ఘోరాటవీమధ్య నొ
క్కఁడ వొంటిం బయనించుచుంటివి నిరాఘాటమ్ముగా మృత్యు వి
క్కడ వ్యాఘ్రాకృతి సంచరించును నరాగారమ్ము వాంఛించి యే
పెడదారింబడ కిల్లుఁజేరవలెఁ దెల్విన్ శీఘ్రయానంబునన్!

కటికిఱాలు దగులఁ గంటకములు విఱుగ
సురిగి నెత్తురుల్గారు నీ చరణయుగళి
నేను చేతులనద్ది నిన్నెత్తుకొనను
లేకపోయెఁగదయ్యయో! నాకుఁ దనువు!

సుతుఁడ! నీ కత్తికోతకుఁ గుతుక దెగియు
నిన్నుఁ గనిపెంచి మనిపిన నెనరుగతన
పోయి పోవని నామొండి ముసలి యసువు
పోవుచున్నది! నీ వార్తిఁబోవుచుండ!

అని తనచేతనున్న తనయమ్మ శిరస్సు వచించుచుండఁగా
విని నటులయ్యె నాతనికి భీతిలు పుత్రునిమీఁది ప్రేమచే
జననియె యట్లు సత్యముగఁ జచ్చియుఁ జావక జీవనాళముల్
కనులను నిల్పి పల్కినదొ ! కాక మతిభ్రమణంబు గల్గెనో !

శీతలము గ్రమ్మె దేహము
చేతలుడిగి వధిత మాతృ చింతాతురుఁడై
యాతం డోతల్లి ! యనుచు
భూతలమునఁబడియె దళిత భూజముపగిదిన్.

చాలసేపుదనుక చైతన్యమేలేక
పడినవాఁడు పడిన పగిదినుండె
జీవములు సడలెనొ ! స్మృతిదప్పి పోయెనో !
పలకఱాతినేలఁ బడుటకతన.

ఎటులనొ ! కొంత ప్రొద్దున కొకించుక చేతనమబ్బి లేవలే
కటునిటు పొర్లిపొర్లి యలనల్లఁన జేతులపూన్కి మేని తూ
లుట నొకయింత యాఁచి మదిలోని మహాపరితాపకీల లో
క్కట నవనాడులన్ రగులఁగా నతఁడూరక వెచ్చనూర్చుచున్.

గుండె చెఱువయి కన్నీరు గ్రుమ్మరించె
నైన నేల మనస్తాప మాఱిపోవు ?
పట్టి పురుగేరితీరుఁ దత్పాపఫలము
గాలికింబోవు వగుడాకుగాదుసుమ్ము !

వలపు జవరాలి మాటకు
దలయూపుట, కన్నతల్లి తలఁదఱిగెడి యీ
తఱిబిసుసుపనికి దిగుటయుఁ
దలంపునకు వచ్చి యిట్లతఁడు వాపోవుఁ.

కలఁగనుచుంటినా ? నిజముగా జనయిత్రిని జంపుకొంటినా?
కలయె యథార్థమేమొ ! కలగాక యథార్థమయెని నే నిసి !
ఖలమతినౌచు నాజనని కంఠముఁద్రుంతున ! త్రుంచఁబడ్డ యా
దల వచియించునా ? యిటు యథావిధిగా మధురప్రియంబులన్.

కలయని నమ్ముటెట్టు లిది కాననమా ? గృహమా ? పరుంటినా ?
తలగడయేది యంచవనిఁదట్టుచుఁ దల్లి శిరస్సుఁదాకె హా !
కలయనరాదు కాదు కళగాదిదిగో ! తలకాయ యయ్యొ ! నా
తల పడిపోను ! యౌవన మదాంధుఁడఁ జంపితిఁ గన్నతల్లినే !

కలువల చెల్మికాఁడదె ప్రగాఢ తమోమయ దీర్ఘ వారిదం
బుల తెరలందుఁ జిక్కువడిపోయి వెలుంగఁగలేక వెల్గుచున్
దెలుపుచునుండె మద్భయద నిష్ఠుర మాతృవధ ప్రబంధముఁ
దలపడి యెంతదాచినను దాగదు పొమ్ము యథార్థమెప్పుడున్.

ననుఁ గాపాడఁదలంచి కన్దెరలలోనా ? వీనులందా ? సుధా
ధన భాండారములైన యీ పెదవులందా ? ప్రాణముల్ నిల్పి తీ
యని నీ ప్రేమలఁ గుమ్మరించితివి మాతా ! మృత్యువెంతేనియున్
జెనకన్నేరని నీకృపామహిమకేఁ జేమోడ్చి వాపోయెదన్ !

ఎట్టు వచించినావు జననీ ! యసుశక్తి రవంతలేని యీ
వట్టి శిరస్సుతోడ మృదువాక్కులఁ దేనెలఁజిక్కిలించి ? నీ
దిట్టపు కన్నప్రేమకుఁ బ్రతిధ్వనులెత్తినదీ నగంబు నా
చిట్టెపు జ్ఞాతిగుండె వగఁజిక్కి ద్రవించి స్రవించిపోవఁగన్ !

కటకట ! నా కృపాణమున కాయము వాసియు నేరవింతయున్
గటికితనమ్ము నాపయినిఁగన్న మరల్ దెగిపోనితల్లివై
యటవిని నాకునై ప్రియములాడెదవే ననుఁ జుట్టుముట్టు సం
కటములు దీర్పఁబుట్టినదిగా ! యనురాగము నీదుపుట్టికున్.

నను ముసురుకొని రక్షించు నెనరుబుద్ధి
నీతలకు నా పుటుకలతోనే జనించె ?
పుట్టెఁబుట్టిన బుద్ధులు పోవటంచు
ప్రాజ్ఞులంద్రది యెట్టు లబద్ధమగును ?

" కొడుకా! భద్రమురా ! నిశీథమున నీఘోరాటవీమధ్య నొ
క్కడ వొంటిం బయనించుచుంటివి నిరాఘూటంబుగా మృత్యు వి
క్కడ వ్యాఘ్రాకృతి సంచరించు " నని వక్కాణింతువే తల్లి ! యె
క్కడి వీ దివ్యదయావచోమృతము లింకన్ నేను సేవింపఁగన్ ?

కొడుకా ? వీఁడొక కాలకింకరుడు నీకున్ దల్లి ! నమ్మించి నీ
మెడనేకోసిన గర్భశాత్రవుని దుర్మేధాదురంతాకృతిన్
గొడుకా ! యంచు మరందముట్టిపడ నాక్రోశించినావక్కటా !
చెడలేదింకను ప్రేమ వాఙ్మయ భవజ్జిహ్వాగ్రమాధుర్యముల్ !

కటికిఱాల్దగిలిన కంటకములు పడిన
శ్రమయె యెఱుఁగని నా మొండి చరణయుగళి
నీవుగుప్పిన పలుకుల నెనరుజడికి
విఱిగె నిచ్చటఁబడిచత్తు వెడలిపోను !

కంటకశిలాసహస్రమే కాదు నన్నుఁ
బ్రకృతియంతయు హింసించె బాధపడను
పచ్చి విసమట్టి పాపభీభత్స చింత
నా నరనరమ్ముఁ రాచి అంపానబెట్టు!

మాతృదేవీ పదవి నాదమఱపులేక
చచ్చి సాధించుకొన్నావు జన్మఫలము
కడుపుఁ జెఱచిన యెద్దంత కొడుకువీఁడు
బ్రతికి తృణలేశమాత్ర సార్థకతఁగనఁడు !

ఇంతకు జాముక్రిందట మహేశుఁడు నావధ కాగ్రహించి న న్నంతమొనర్ప కాలచటులాంబుదమూర్తిని రేగె, వాని నే పుంతల ముంచిపోసితివొ ! బొట్టును బైఁబడనీక తల్లి ! యీ చెంతనె యేళ్ళు హోరుమని చెట్టుల గుట్టలఁ దన్నిపాఱెడుఞ్.

నా కఠినప్రవృత్తికి ఘనం బనలంబయి వాయువుగ్రమై
చీఁకటి గబ్బగిమయి కసిఞ్ ననుఁ బ్రాణముఁదీయఁజూచినఞ్
సోకగ నీ వపాయముల నోయమ ! యింతకుఁ గాకిపిల్లపైఁ
గాకికి లేకపోనె కనికారము ? తన్నెవరెట్లు చూచినన్ ?

సమతూగునేయమ్మ ! చల్లని నీ ప్రేమ
భరమునకు హిమవత్పర్వతమ్ము
సరిపోవునేతల్లి ! యెరలేని నీ ప్రేమ
విస్తృతాకృతికి నీ విశ్వజగతి
తులయౌనె జనయిత్రి ! కొలలేని నీ ప్రేమ
రసమాధురికి రుచిరామృతమ్ము
ప్రతివచ్చునే మాత ! మితిలేని నీ పేర్మి
విలువకుఁ గనకపృథ్వీధరమ్ము

ఎంతభర మెంతబాహుళ్య మెంతమధుర !
మెంతవిలువయైనదియొ ! మాతృదయనేఁడు
తెలిసికొన్నాఁడ జనని ! నీ గళముఁగోసి
దణదణంజిందు ప్రతిరక్త కణమునందు.

పడితప్పినపుడెల్ల వ్యాధు లంటఁగనీక
యతి జాగరూకత నసువుగాచి
ఆకొన్నయపుడెల్ల నమృతధారలవంటి
స్తన్యధారలతోడఁ దనువుఁబెంచి
వాపోవునపుడెల్లఁ బనిమానుకొని జోల
పాటలఁ దన్మయత్వముఁ ఘటించి
ఒడలారునపుడెల్లఁ దడయక చలువైన
చమురుఁ బూతలతోడ సౌరఁబెట్టి

పెద్దఁజేసి విజ్ఞానంబు పెంపుఁదెచ్చి
కన్న కడుపన్నఁ బడిచచ్చు కన్నతల్లి
కక్కటా! గొంతుకోతలా? యబ్బురాల
కొడుకు! మేలె! యీక్రౌర్య మెక్కడనుఁగలదె?

నవమాసములుమోసి నానావ్యథలకోర్చి
కన్నందుకే కనకాభిషేక?
ముగ్గుతోఁ బాలతో నుసురెత్తుగాఁబెంచి
నందుకే దినవేతనాంకితములు?
మలమూత్రములుదీసి నిలువూడిగముఁజేసి
నందుకే రత్నకంకణ సమర్చ?
రోగానకు రొదకు జాగారములుచేసి
నందుకే బిరుదహర్షాభినుతులు?

అయిననేమమ్మ! నీ దేహమందుఁగలుగు
ప్రత్యణువుఁగూడ నాకున్నై ప్రాకులాడు
నొకరు పెట్టి పోషించిన! నూరకున్న!
సాగుచునెయుండు! నాఁగవు సహజకళలు!

ఒక పెనుకామభూతము మహోద్ధతి నా హృది నావరించి నా సకల సుఖప్రసన్నతకు సాధనమైనటులన్ నటించుచున్ వికలునిఁజేసి నాకనుల నేనె యువారిగఁ దాల్చి దుమ్ముఁ గొట్టుకొనఁగజేసె నంబరొ! యెటుల్ పయనింతును? గ్రుడ్డిగువ్వనై!

భాషింపదా యింక పలుకుఁబల్కునఁ దేనె
ప్రభవింప నా మాతృవాఙ్మయంబు ?
కనుపింపదా యింక కాళ్ళు కన్నులుఁగల్గి
తిరుగుచు ననుఁగన్న దేశలక్ష్మి ?
ఎడమయ్యెనా యింక కడలేని సౌఖ్యంబు
ఫలియించు నాపాలి స్వర్గసీమ ?
చేయెత్తి దీవింపదా యింక నామేలు
వాంఛించి నాకొల్చు భద్రకాళి ?

నకలు లేనట్టి మాతృనామక విశేష
భద్రసంపదన్వితజీవభాండికలను
కన్నుమిన్నుఁగానక కాలఁ దన్నుకొన్న
భాగ్యహీనున కింకేటి బ్రతుకులమ్మ ?

ఈ యరణ్యమందు నీకత్తిచేతనే
యసువుఁబాసి యెటకొ ! యరగినావు
ఈ యరణ్యమందు నీకత్తిచేతనే
యసువుఁబాసి యటకు నరుగుఁదెంతు !

పాపదేహమింక భరియింపఁగాలేను
తప్పుసైచి యెట్లొ యొప్పుకొనుచు
నీవు చేరుకొన్న దేవలోకమునకు
నన్నుఁ జేర్చుకొమ్ము నా సవిత్రి !

అనుచు నాతఁ డాత్మహత్యకుఁ దలపడి
కత్తి కుతుకమీఁది కెత్తుకొనియె
అంతలోన హా! యటన్న యార్తధ్వని
చెట్లమాటునుండి చెవినిఁబడియె.

ఆ యార్తధ్వని కను కం
పాయత్త స్వాంతమునఁ దహతహపడుచు నే
దో! యొక యడియాసకు లో
నై యాతఁడు వెదుకఁదొడఁగె నాయాచోటుల్.

జడనుండి గాలికి విడివడి మూపుపైఁ
బొరలాడు నిడుపాటి కురులదాని
నెటుపోను పాల్వోక యటనుండి భీతిమైఁ
జుట్టుపట్టులఁ బారఁజూచుదాని
నపరంజికిని మేని కంతరమ్మేలేని
చక్కని లేఁత కెంజాయదాని
నెడమడొక్కపయి చేయిపయిఁజేయి నటులె
యదిమి పట్టుకొనియున్నట్టిదాని

సారెసారెకు వ్యధ నేదొ! సైపలేక
వెచ్చవెచ్చని నిట్టూర్పుఁ బుచ్చుదాని
నతఁడు గాంచె నడుగడుగు సడ్డగించు
వెదురు తంగేటి పొదలకు నొదిగి యొదిగి.

ఆమె తన పాపసంతాప మపనయించు
నే మహాదేవతయొ ! యని యెంచెఁగాని
ఆ స్వరూపంబు గుర్తింపఁడయ్యె నెంత
మావులు జలమ్మయగుఁ బిపాసావశునకు.

మాతృహత్యాఘ జలధి నిర్మగ్ను నన్ను
లేవ నెత్తఁగ డిగిన యే దేవదూత ?
వింత కొడిఁగట్టి స్నేహమిట్టింకిపోవు
నీ దివియ నోజ ముట్టింతు వెవరు తల్లి !

అగపడియె నె ? యోయమ్మ ! మాయమ్మ నీకు ?
ఒక్క వ్రేటుకే కటకటా ! యుసురుదొఱఁగి
నన్ను విడలేక విడలేక కన్నుమూసి
చిన్నగా దేవలోకమ్ముఁ జేరుకొనుచు.

నీకు నన్నుద్ధరించు స్వర్ణిధులనుండి
పడిన చింతామణికి మల్లఁబడునదేది ?
చేర్చుమా తల్లి ! మాతల్లి చెంతకునను
చెఱుపువచ్చునే పుణ్యంబుఁ జేసికొన్న ?

అనుచు నేమో ! నుడువఁబోవునంత నామె
యతని వంకకు మరలిన దవలనుండి
అతఁడు ఖిన్నుఁడై పోయినాఁ డామెనరసి
ఆమె వెలవెలఁబోయిన దతనిఁజూచి.

ఏ మహాశక్తులున్నవో ! యామెయందు
ఆమెఁ గనలేక నిశ్చేష్టుఁడయ్యె నతఁడు
ఏ నిగూఢతలున్నవో ! వానియందు
వానిఁగనఁగానె యతి ఖిన్నయైనదామె !

కురులు వలగొన్న నశ్రువు లురలుచున్న
హస్తముల నట్టె డొక్కకు నదిమిపట్టి
తిన్నతిన్నఁగ నూపిరి దీసికొనుచు
దుఃఖ గద్గదకంఠమ్ముతోడ నామె.

అయయో ! చంపనె చంపినావె యెవరో హాస్యార్థమర్థించినన్
దయయున్ ధర్మమువీడి నీజనని నన్యాయంబుగాఁ బ్రేమ కా
లయమై కోమల భావసౌరభ విశాలమ్మైన నీయాత్మ మ్రో
డయి పాడై విషవాయువుల్ విసరెనేమయ్యా ! కళారాధకా !

తమవివలె నన్యులవియుఁ బ్రాణములుగావె ?
ఏల ఖూనీలకు దెగింతు రీ మనుష్యు
లకట ! క్రిమికీటకాదుల కంతరాత్మ
యున్న తమకుఁ గ్రియాభేదముండవలదె ?

జగతిఁ బుట్టింప గిట్టింపఁ జాలినట్టి
సృష్టికర్తకే యేమైనఁ జెల్లుగాని
అకుఁజిదిమి యతుకఁజాలనట్టి నరుఁడు
హత్యసేయుట కెవ్వఁడేహక్కుగలఁడు ?

అమెఁ జంపించు మన నొకింతైన లేదు
కటకటా ! యాంధ్రధర కలంకారమగుచు
దివ్య దీప్త్యుజ్జ్వలమ్మైన దీపకళిక
మలిగిపోయిన నాకేమి వెలిఁగిపోవు ?

నీ ప్రేమ నీక్షింప నీకుఁ బ్రాణంబైన
యమ్మనే త్రుంచుమంచడిగినాను
దాని కనుమతింపఁ దలఁపవ కాయని
తలఁ జూపవలెనంచు వలచినాను
అంతకైనను వలదందువేమో యని
త్రావఁగూడని బ్రాందిఁ ద్రాపినాను
దానికొప్పుకొనఁగ దండకారణ్యామీ
శ్రీగిరికడకు రాఁజేసినాను

అప్పటికినైన మాతృహత్యాఘమునకు
నడలి వెనుకాడెదవుగదా ! యనుచు భ్రమసి
తుదిఁ బరీక్షగ మెత్తని పదునుగలుగు
విచ్చుఁగత్తినే చేతి కందిచ్చినాను !

చంపనే చంపవంతకుఁ జంపఁబోవు
నపుడు వారింపగావచ్చు నంచుఁదలఁచి
నిను మిగిలిపోవనిచ్చి నీకనులఁగప్పి
పుచ్చి నేను నీవెనుకనే వచ్చుచుంటి.

ద్రాసెఁగాఁబోలు నోనాథ! బ్రహ్మ నాదు
నుదుటి పలకపై మూఁడు పంక్తులనుదీర్చి
నిన్నుఁ గడుపారఁగన్న పున్నెములతల్లి
పుట్టె డుసురులు నే నొడిగట్టుకొనను.

రావిచెట్టుకడ నెదురు ఱాయిదగిలి
విఱుచుకొనిపడి బొంది నూపిరులువోయి
ఒక్కదాననే యక్కడ నుండిపోతి
కదల స్మృతిరాక! యొక యరగంటదాఁక!

తడవుచేసిన జతనంబు చెడునటన్న
భీతి నట్టులే ప్రాణముల్ బిగ్గఁబట్టి
నిలకడయెలేక యెలుగెత్తి పిలుచుచు నిను.
వెదకఁదొడఁగితి నడవిని వెతలువడుచు.

హరి హరీ! యవేమి యుఱుములు మెఱపులో
అయ్యయో! యదేమి యనిలమొ! యక
టక్కటా! యదేమి యంధకారమొ! గాని
తలఁచుకొన్న గుండె జలదరించు.

విశ్వంబుఁ గబళించి వెఱపించు తమములో
నా కనుపాపలన్ గవయనీక
మేఘ గర్భమునుండి మిలమిలమెఱసెడి
మెఱపులో నామేను గరగనీక

పిడుగుపిండులురువ్వి పెళ పెళ యుఱిమెడు
సుఖములో నాగుండె లొంగనీక

భువనాలఁ గుదిలించి బోరున వీచెడి
గాలిలో నాగాలిఁ గలయనీక

ప్రకృతి నాకు నే యపాయమ్ము రానీక
కంటిఱెప్పవోలె గాచికాచి
రక్తసిక్త మీ దురంత జీవిత నాట
కమున ముఖ్యపాత్రగా నొనర్చె.

నేను కుమతినై నీతల్లి ప్రాణములను
వట్టి యన్యాయముగఁ బొట్టఁబెట్టుకొంటి
నందు కీ పాటుబడితిఁ గర్మానుభవము
ద్రోసిపుచ్చనౌనే చతుర్భుజునకైన!

ఇట్టియో! బట్టియో యది యెఱుఁగజాల
గంతుకొనివచ్చి శాతశృంగములతోఁడ
నిన్ను వెదకుచు నిటవచ్చుచున్న నన్ను
నెడమ డొక్కలోఁ గ్రుమ్మిపోయినది సఖుఁడు!

కనుమిదె యంచు నాతనికిఁ గానక తాకినఁగోటి మృత్యువుల్
కనలెడురీతి నెత్తురులఁ గ్రక్కెడు గాయముఁ జూపుకొంచు నిం
క నిలువ దుస్సహంబయినఁ గన్నులుమోడ్చుచు నామె కేలుదో
యి నురలనీక నేల కటులే యొరుగంబడి పోవుచుండినన్.

ఆ యలిబాబు మాతృవిలయవ్యసనగ్రసనైకభావుఁడై
యా యెలనాగయియ్యదె సఖా! కనుగొమ్మని చూపునంతకుఁ
గాయము నామెనున్ గనులగాంచని యాతఁడుగాంచె నవ్వడా
హా! యని భ్రాంతచిత్తుఁడయి యాయమ నా యమయాతనాస్థితిఁ.

కనుగొనినంత పుంటిపయిఁ గారముఁజల్లిన యట్లు దుఃఖ వే
దన ద్విగుణీకృతంబయి హృదంతర మట్టిటులూపుచుండ నొ
య్యనఁ దన యంకశయ్య నతఁడామెనుజేర్చుకొనెన్ దదశ్రువుల్
చినుకులు చిన్కులై కురిసి చెంపలువేసిన వవ్వధూటికిఁ.

వాడిన కపోలములమీఁది వాని వేడి
వేడి కన్నీటితో గుండె మాడిపోయి
అట్టె గాయంబు నొక కేల నదిమిపట్టి
నెనరుమైఁబ్రియు నొక కేల నిమురుచామె.'

ప్రేమ సత్య మహాయజ్ఞ వేదిమీఁద
నాత్మ సర్వస్వమర్పించినట్టి నీకు
నాలిఁ దెగనమ్మి యక్కఱ నార్చుకొన్న
ఆ హరిశ్చంద్రుఁ డేమాత్ర మార్యపుత్ర!

ఏడుతురే యథార్థతవరించిన ధన్యులు నాశనమ్ము చే
యాడని సద్యశమ్మునకునై బ్రతుకుం బువుదోఁట బీడగుం
బాడగుగాక త్వాదృశులు పట్టిన పట్టువంటిదైన ని
ట్లేడిచి యేడ్చి యెంతతవుసెత్తినఁ జచ్చినవారు వత్తురే?

నట్టడవిన్ భవజ్జనని నావలనంగద? యక్కటక్కటా!
యిట్టయి పోవునంచెడఁద నేనుఁ దపించుచునుంటిగాని నే
డిట్టుల గాకపోయిన మఱెట్టులనైన మృతించు నందఱుం
బుట్టుట యెల్ల గిట్టుటకెపో! యొక యించుక వెన్కముందుగా.

అలఘుక్ష్మాపతులై జగంబులనె యాటాడింపగాఁజాలు నా
బలి యేడీ? శిబి యేడి? ధర్మజుఁడు పాపారాయుఁడుఁ గృష్ణరా
యలు నేరీ? శిలవేసికోఁగలిగినారా? వారి సత్కీర్తి మూ
ర్తులుగాదే యిల నిల్చిపోయినవి మృత్యుస్పర్శలేకుండగన్?

ఎవ్వనిజీవిత మ్మవనియే జనయిత్రిగ సుప్రతిష్ఠయే
క్రొవ్వలపుం బడంతుకగ గూటికి పేదలె కన్నసంతుగా
నొవ్వక యెప్పుడున్ నడచునో తనదే నరజన్మగాని యా
యవ్వకు నాలికిం బ్రతుకునట్టినరుల్ నరులే తలంపగన్?

వేషములు సంకరములై
భాషాపోషణములేక బహువిధ జాతి
ద్వేషములకు లోనై నినుఁ
బోషించెడి తల్లి యుడిగిపోవుచునుండెన్.

కనులు రెండైన దృష్టి యొక్కఁడగు నట్లు
కన్నతల్లియు దేశమొక్కటియె సుమ్ము!
చనిన తల్లిని బ్రతికించుకొనుటమేల?
చనెడు తల్లిని బ్రతికించుకొనుటమేల?

మడసిన తల్లియే తెనుఁగుమాతగ నీ చురకత్తి వ్రేటె యీ
నడచెడు ధూర్తకాలముగ నాయెడ ప్రేమయె ఘోరదీక్షగా
గడచినదెల్ల నొక్క కలగా గ్రహియించి యశఃప్రియుండవై
కడఁగుము దేశసేవకు సఖా! పెఱవారికిఁ గన్నుగుట్టగన్.

కొనజుట్టునుండి చొఱఁగొని
మునిపాదమువఱకు కణుకణువునను బరుల ప
ర్తనమె పరవంజుకొన్నది
యనల నిభంబైన తెనుఁగు నవనీస్థలిలో!

ఆంగ్లపదమ్మొక్కటైనను మిశ్రమిం
చని యచ్చతెనుఁగు భాషణములేదు
దినదినంబును కాఫి తేనీటఁ దెల్లవా
రని తేటతెనుఁగు పత్తనములేదు
ఫక్తు తెల్లదొరలపగిది వేషమ్ము వే
యని తెన్గు నాజూకుతనువులేదు
రకరకంబుల సీమ క్రాఫింగు జుట్లుకొ
గ్గని తెన్గు మగతలకట్టులేదు

ధూమశకటంబు పయనింపఁ ద్రోవలేని
యడవి యూరువల్లెల వృద్ధులందుగాక
కానఁబడునె యిపుడు కలికమున కేని
కలితి కలియని సిక్కచ్చి తెలుఁగుదనము?

ఎఱుకపడుటలేదు మృష్టాన్నభోక్తల
కనదల తీవ్ర క్షుధాగ్నిబాధ

భావ్యమగుటలేదు పట్టాంశుకధరుల
కనదల వస్త్రశూన్యత్వచింత

బోధపడుటలేదు సౌధవాసులకు ని
ర్భాగ్యుల తరుతలావాసఘోష

అర్థమగుటలేదు హర్ష జీవితులకు
పేదల దుఃఖజీవితచరిత్ర

స్వార్థపరుల యధిక సంపాదనాయుక్తి
యంత్ర సముదయముల కహరహంబు
కూలినాలి ప్రజలు కూలారుచున్నారు
చాలినంత కూలి జాఱకునికి.

ఎంతయొ దేశభక్తి నటియించుచుఁ గొందఱు స్వార్థలోలురై
వింతగ లేఁతలేఁత సౌరపిందెల నెన్నియొకోసికోసి యా
వంత ప్రయోజనంబగు క్రియం బొనరించినయట్లు కానరా
దింతకు వట్టి గొడ్లకుఁగదే యఱపుల్ మివులంద్రుడు పండితుల్!

తమ దేహంబునఁ గల్గు ప్రత్యణువు శుద్ధాంధ్రప్రతాపమ్మునన్
గొమరారన్ దమ యాస్తిపాస్తులు తెనుంగుందేశ సంరక్షణా
ర్థము వెచ్చించెడు వీరదాతలును స్వార్థత్యాగు లున్నారు గా
ని మహానైక్యము సాగనీయ దడుసేనిన్ వారి యత్నంబులన్.

ఆ మహానైక్యమునఁగాదె ? యక్కటకట !
మొదలికొక్క కులముఁ దలకొక్క మతము
పుట్టగలుగుచు దేశంబు పట్టెడగుచు
జులకనై నార మెటువంటి శుంఠ కేని !

గాంధిజీపేర దేశమ్ముఁ గావనున్న
పదునొకండవయవతార భాగవతము
రక్తిగట్టెనుసరికి నీరసుఁడెవండొ !
తిమిర దుఃఖంపుఁదెర నడ్డుపెంచినాఁడు !

ఆ మహాత్ముని శాంతి చక్రాయుధమున
శాత్రవగ్రాహమెడసి స్వేచ్ఛాసుఖమ్ము
తలమునుకలై త్రివర్ణ కేతనకరమ్ము
నాట్యమాడించె భరత దంతావళమ్ము !

గోడకుర్చీలతో నేర్చుకొన్న దతని
యాత్మ బోధాగమవిశేష మఖిలజాతి
సుఖవుఁగని పుట్టుబీదల చుట్టుఁదిరుగు
భీకరాస్పృశ్యతకుఁ గాళ్ళుబేరమయ్యె.

హిట్లరు మహోగ్రసంగ్రామ నృత్యమునకు
క్షామతలమ్మునఁ గ్రమ్మిన కాటకమ్ము
ఏడెనిమిదేండ్లు గడచిన నింతవఱకు
విడిచి పోవదు పేదలఁ బిడుచుకొనుచు !

ధర్మంబు నాల్గుపాదమ్ముల నడచిన
వసుధనే న్యాయమ్ము పట్టిపోయె

విశ్వవిజ్ఞానమ్ము వికసించు పృథివినే
యక్షరాస్యత యడుగారిపోయె

జగతి కహింసాప్రశస్తి సందేశించు
ధరణినే హింసలు పెరిగిపోయె

త్యాగంబునకుఁ బ్రసిద్ధంబగు ధాత్రినే
లంచగొండితనమ్ము మించిపోయె

రత్నములు రాజనాలుగా రాశివోయు
భూమికింత సౌభాగ్యంబు పుట్టదయ్యె !
నించుమించుగ రెండునూరేండ్లనుండి
ఎవ్వఁడో పెత్తనము చలాయించుకతన !

విశ్వ నాశకమౌ నవిద్యాపిశాచమ్ము
నెందు లేకుండ మాయింపవలయు
ధనమెవ్వ డొకని పెత్తనమునఁ బోనీక
దీనులందఱికి నందింపవలయు

నాది నీదను మహానైక్యమ్ము సృష్టించు
కఠినసత్త్వములను బోకార్పవలయు
ఫలరహితంబైన పట్టినేలలఁగూడ
వరిభూములుగఁ గావింపవలయు

దివ్య జాతీయ రేఖలు దిద్దితీర్చు
సత్కళారక్ష నిరతంబు జరుపవలయు
నప్పటికిఁగాని మనదేశ మెప్పటివలె
రాణఁ జెందదోయీ ! రామరాజ్యమగుచు.

నీ యకలంకకీర్తి కమనీయ సుఖామరలోకమందు దీ
ర్ఘాయువుఁబోసికొంచు భవదంబకుఁ దోడయి యింక నేనునున్
హాయిగఁ గన్నుమూసెదను నాసఖ ! యే వగవంతలేక నీ
యీ యెలప్రాయమంతయు వ్యయింపుము మాతృజగద్ధితంబుగన్.

అనుచామె నుడువుచు నుడువు
చునె కెవ్వునఁ గేకవైచి సుహృదిరుగు చా
తని యరుణాంక స్థాన
మ్మునమండి గుభిల్లునఁ బడిపోయిన దవనిన్.

ఆమె స్వాదుగళమ్ము నందుకొన్నదివోలె
కోయిల యింపుగాఁగూయసాగె

ఆమె తనుచ్ఛాయ నందుకొన్నదివోలె
తొలికొండ కెంజాయలొలుకసాగె

ఆమె చల్లని యూర్పులందుకొన్నదివోలె
పిల్లగాడ్పుల్లన వీవసాగె

ఆమె మనస్తాప మందుకొన్నదివోలె
పసిప్రొద్దు వెచ్చగా మసలసాగె

మాతృహృదయేశ్వరి ఘోర మరణములకు
బాష్పములు చింది వెలవెల వాఱిసట్టి
నాఁటి యా యలిబాబు నాననముపోలె
దెసలు దెలుపెక్కి బలబల తెల్లవాఱె !

అతఁ డాయింతి ప్రబోధలక్ష్మికి వశుండైనట్టి వానింబలెన్
బ్రతుకుల్ దీఱిన తల్లినిన్ సతిని చెంతంబారు నయ్యేట వై
చి తదార్తిన్ గణియింపకే పురికి వచ్చెన్ "గారు"లో ధీరతన్
వితగాఁబోవునె? యార్ద్రచిత్తుల యశోవీరప్రబోధార్థముల్ !

